# దక్షిణ భారత
# వనితా వాగ్గేయ వాఙ్మయం



*రచన:*

**డా॥ వై. కృష్ణకుమారి**



*ప్రచురణ:*

**యువభారతి**

*Dakshina Bharata Vanitha Vaaggeya Vangmayam*
by **Dr. Y. Krishnakumari**



| | | |
|---|---|---|
| ప్రచురణ | : | **202** |
| ప్రథమ ముద్రణ | : | **2022** |
| వెల | : | **రూ. 100/- $ 5** |
| ముద్రణ సహకారం | : | 'పుస్తకశిల్పి' **తాళ్లపల్లి మురళీధర గౌడు** |
| ముఖచిత్ర రూపకల్పన | : | ..... |
| డి.టి.పి. | : | **ఉల్లి కాంతారావు** |
| లే అవుట్ | : | **మను గ్రాఫిక్స్**<br>చిక్కడపల్లి, హైదరాబాద్ |
| ప్రతులకు | : | **డా॥ వై.కృష్ణకుమారి**<br>19-58/2/బి/1, జై రాఘవేంద్రనగర్<br>టీచర్స్ కాలనీ, కల్యాణపురి<br>హైదరాబాద్ - 500 039<br>ఫోన్: 98854 51014<br><br>**యువభారతి**<br>తెలంగాణ సారస్వత పరిషత్ భవనములు<br>తిలక్‌రోడ్, హైదరాబాద్ - 500 001<br><br>**నవోదయ బుక్‌హౌస్**<br>కాచిగూడ చౌరస్తా, హైదరాబాద్ - 500 027<br>ఫోన్ : 92474 71362 |
| ముద్రణ | : | **కర్షక్ ఆర్ట్ ప్రింటర్స్**<br>విద్యానగర్, హైదరాబాద్-500 044 |

'పద్య కళాప్రవీణ', 'కవి దిగ్గజ'
డా. ఆచార్య ఫణీంద్ర
తెలుగు విశ్వవిద్యాలయ "కీర్తి పురస్కార" గ్రహీత
అధ్యక్షులు, "యువభారతి" సాహితీ సాంస్కృతిక సంస్థ



# వనితలు - వాగ్గేయ కృతులు

తెలుగు సాహిత్య రంగంలో ఒక విశిష్ట స్థానాన్ని సంతరించుకొన్న "యువభారతి" సాహితీ సాంస్కృతిక సంస్థ ఈ 2022 విజయదశమి పర్వదినం నాటికి 59 సంవత్సరాల సుదీర్ఘ సేవను పూర్తి చేసుకొని అరవదియవ సంవత్సరంలోకి అడుగిడింది. ఈ అరవయ్యేళ్ళ ప్రస్థానంలో యువభారతి సంస్థ-సత్సాహిత్య పఠనం సమాజంలోని పౌరులలో సౌమనస్యం, సౌశీల్యం పెంపొందించేందుకు దోహదపడుతుందని విశ్వసిస్తూ, అనేక సాహిత్య కార్యక్రమాలను నిర్వహించింది. 200లకు పైగా విశిష్ట సాహిత్య గ్రంథాలను ప్రచురించి, పలువురి మన్ననల నందుకొంది. ప్రస్తుత గ్రంథం ఆ పరంపరలో 202 వ గ్రంథం.

డా. వై. కృష్ణకుమారి గారు మా సంస్థ వరిష్ఠ సభ్యులు. చక్కని గాయని. గతంలో యువభారతి సభలు, సదస్సులు అనేకం ఆమె మధురమైన ప్రార్థనా గీతాలాపనతో ప్రారంభమయ్యేవి. మంచి సాహిత్యాభినివేశం కలిగిన ఈ విదుషీమణి గతంలో - "వాగ్గేయకారుల భక్తి సంగీత సంప్రదాయాలు, ప్రయోగాలు" అన్న ఆసక్తికరమైన అంశంపై పరిశోధన సలిపి, పిహెచ్.డి. పట్టాను సాధించారు. లోగడ చేసిన ఆ పరిశోధనకు అనుబంధంగా, ప్రస్తుతం ఆమె సహజమైన స్త్రీవాద స్వాభిమానంతో కూడిన మరింత శ్రద్ధతో, దక్షిణ భారత కవయిత్రులపై .. ముఖ్యంగా ... వనితా వాగ్గేయకారులపై పరిశోధించి ప్రత్యేకంగా రూపొందించిన గ్రంథం ఇది.

ఈ గ్రంథంలో కృష్ణకుమారి గారు .. సంగీత విద్య ఆరంభ, వికాసాలను గురించిబీ ఛందస్సుకు, సంగీతానికి మధ్య గల అవినాభావ సంబంధాన్ని గురించి; వాగ్గేయ కారుల నిర్వచనం, లక్షణాల గురించి వివరించారు. ఆ పైన సంస్కృతం, తెలుగు, తమిళం, కన్నడం, మలయాళం భాషలలోని వివిధ కవయిత్రుల పరిచయం, సాహిత్య సంగీత రంగాలకు సంబంధించి వారి కృషిని గురించి, ఆ యా రాష్ట్రాలలో పర్యటించి, తాను సేకరించిన మౌలిక సమాచారం మేరకు సోదాహరణంగా వివరించారు. ఈ అంశంపై భావిలో మరింత పరిశోధన జరగాలని ఆశాభావాన్ని వ్యక్తపరిచారు.

యువభారతి ప్రచురణగా వెలువడుతున్న ఈ గ్రంథం-సంగీత, సాహిత్యాల సమన్వయ ప్రస్థానంపై, ముఖ్యంగా .. వనితా వాగ్గేయకారుల కృషి విశేషాలపై ఆసక్తి గల పాఠకుల ఆదరణకు పాత్రమౌతుందని భావిస్తూ, విశేషమైన శ్రద్ధతో గ్రంథాన్ని రచించిన సంస్థ సభ్యురాలు డా. వై. కృష్ణకుమారిగారికి అభినందనలు.

తేది: 16/12/2022 —ఆచార్య ఫణీంద్ర



డా॥ బి.జయరాములు
ప్రధాన సంపాదకులు
యువ భారతి ప్రచురణలు

# భావి పరిశోధకుల కరదీపిక
# డా. వై.కృష్ణకుమారి గ్రంథం

డా. వై.వి.కృష్ణకుమారిగారు చేయితిరిగిన రచయిత్రి. పరిణతి కలిగిన పండిత పరిశోధకురాలు. ఏ విషయాన్నైనా తలస్పర్శిగా అధ్యయనం చేయాలనే తపనగలవారు. ప్రణాళికాబద్ధంగా పనిచేసి ఫలితాన్ని సాధించడంలో ఆమె దిట్ట. మహిళా పక్షపాతి, మహిళా సాధికారతాకాంక్షియైన కృష్ణకుమారిగారు సంగీత సాహిత్య విదుషికాన "దక్షిణ భారతభాషల కవయిత్రుల సంగీతసాహిత్య సౌరభాలు" దేశమంతటా గుబాళింప చేయాలని కంకణబద్ధులయ్యారు. తమ కృషి అందరికీ చేరాలంటే "యువభారతి" లాంటి ప్రతిష్ఠాత్మక మైన సంస్థ మాత్రమే ఆపని చేయగలదని భావించి, తమ పరిశోధనా గ్రంథాన్ని "యువభారతి" ప్రచురణగా తీసుకురావాలని సంకల్పించారు. అంతేకాదు, "స్త్రీశక్తి స్వరూపిణిగా విగ్రహరూపంలో పూజలందుకోవడం మాత్రమే కాదు, సంఘసంస్కరణ దృష్టిగల ఒక మానవతామూర్తిగా కన్పించాలి. ప్రాచీన కాలంలో విదుషీమణులైన స్త్రీలు మనకిట్లా దర్శనమిచ్చారు. ఆ స్ఫూర్తిని తీసుకొని నేటి సమాజంలోని స్త్రీలు మరింత ముందుకు పోవాలి" (నామాట) అనేది ఆమె దృఢమైన ఆశయం.

దక్షిణాదిలోని నాలుగు ప్రధాన భాషలలో ఉన్న వాగ్గేయకారిణుల సంగీత సాహిత్యాలపై వెలుగు రేఖలను ప్రసరింప చేయడమే ఈ చిన్ని గ్రంథంయొక్క లక్ష్యం. "ఈ ప్రాంత స్త్రీలు– వారి మనోభావాలు, ఆలోచనలు, అభిరుచులు చాలా సాత్త్వికమైనవి. భారతీయతకు ప్రతిబింబాలుగా వీరు కనిపిస్తారు. అటువంటి సున్నిత మనస్కులు రచించిన గేయాలు లలితమైన భావాలతో నిండి ఉంటాయనడంలో విప్రతిపత్తిలేదు. భాషలో కొద్దిపాటి మార్పులు ఉన్నప్పటికీ, భావంలో ఒకే రకంగా పెనవేసుకొనిపోయిన ఈ స్త్రీ వాగ్గేయకారిణులను ఒకే తాటిపై నిలబెట్టాలని, జాతీయతా సూత్రాన్ని ఈ రకంగా మరొక్కసారి నిరూపించా"లనే నేపథ్యంతో ఈ గ్రంథ రచన ప్రారంభించారు.



మొదటి సంగీతశాస్త్ర ఆవిర్భావ వికాసాలను "సంగీతశాస్త్రం' అనే శీర్షిక కింద శాస్త్రీయంగా వివరించారు. వేదకాలంలో ముఖ్యంగా ఋక్కుల ఉచ్చారణలోని సంగీతాన్ని విశ్లేషించి చూపి, పురాణకాలం నాటికి సంగీతం సర్వతోముఖాభివృద్ధి చెంది, బహుధా విస్తరించిందని నిష్కర్షగా తేల్చిచెప్పారు. వాయుపురాణంలో గాంధర్వవిద్యగా కీర్తింపబడ్డ సంగీతం రామాయణాన్ని వాల్మీకి మహర్షి గీత కావ్యంగా రచించడంతో లోకమంతటా వ్యాపించిందన్నారు. వైదిక సాహిత్యంలోనే గాక బౌద్ధ, జైనమతాల సాహిత్యాలలో కూడా సంగీత ప్రశంస కన్పిస్తున్నదన్నారు.

తర్వాత "వాగ్గేయకారులు" శీర్షికతో నాదోపాసన గురించి చక్కగా వివరించారు. నాదం–పరా, పశ్యంతి, మధ్యమా, వైఖరులుగా రూపొందుతూ ప్రణవరూపం దాల్చిందని, భగవంతు నుపాసించే అనేక మార్గాలలో నాదోపాసన ఒకటి అని అన్నారు. ధాతుమాతు నిర్మాణాలు రెండూ సమర్థంగా చేయగలవారే వాగ్గేయకారులని "సంగీత రత్నాకరం" ఆధారంగా వివరించారు. "శబ్దరూపమైన సాహిత్యాన్ని, స్వరరూపమైన వర్ణమెట్టు నందు, పరిణత జ్ఞానాన్ని పొంది పొందికగా రెండింటినీ సమన్వయపరచి సహృదయ మనోరంజకంగా రచనలు చేసేవారు వాగ్గేయకారులు" అని నిర్వచించి, "సంస్కృత సాహిత్యంలో శంకరాచార్యులవారు ఉత్తమ వాగ్గేయకారుడని అనవచ్చును" అంటూ చక్కటి ముక్తాయింపు నిచ్చారు.

"సంస్కృతం" శీర్షికన వేదకాలంలో 'ఋషికలు' సంగీత సాహిత్య మిశ్రిత ఋక్కులను రచించి నాటి ప్రథమ వాగ్గేయకారిణులుగా నిలిచారన్నారు. స్త్రీలు అనేక చోట్ల మంత్రద్రష్టలుగా కనిపిస్తున్నారని, వారు సాహితీపరంగా మాత్రమే కాక "అబలా అస్యసేనాః" (5–30–9) అనే వాక్యం ఆధారంగా యుద్ధాలలో కూడా (వారు) పాల్గొన్నట్లు తెలుస్తుందన్నారు. బాలికలకు ఉపనయన కర్మ ఉండేదని, మహిళలు విద్యాభ్యాసం చేసేవారని, గార్గి, రోమిశ, లోపాముద్ర, సరకు, శ్రద్ధ, ఇంద్రాణి లాంటి బ్రహ్మవాదిను లాకాలంలో ఉన్నారని చెప్పారు. స్త్రీవిద్యను పాణిని సమర్థించాడని, ఘోష, వాక్, సార్పరాజ్ఞి, సూర్యలాంటి మంత్రద్రష్టలు సూక్తాలు రచించి పఠించారన్నారు. సంగీత సాహిత్య సమ్మిళితమైన రచనలు నాటి ఋషికలను భారతదేశంలోనే తొలి వాగ్గేయ కారిణులుగా నిలబెట్టాయన్నారు. కాని తర్వాతి కాలంలో పరిస్థితుల ప్రభావంవల్ల స్త్రీల రచనలు మనకు కనిపించడం లేదని, కాని కొందరు స్త్రీలు పరిస్థితులను ఎదిరించి రచనలు చేశారని తేల్చారు.

ఇక అయిదవ వ్యాసం "తెలుగు"లో తొలి తెలుగు కవయిత్రి తాళ్ళపాక తిమ్మక్క (సుభద్రా కళ్యాణం), మొల్ల (రామాయణం)– రచనల గురించి సోదాహరణంగా వివరించి, వాటిలోని సంగీత, సాహిత్య సొబగులను చక్కగా విశ్లేషించారు. రామభద్రాంబ, పసుపులేటి రంగాజమ్మ (మన్నారు దాస విలాసం) మొదలైన వారి గురించి స్థూలంగా వివరించి, బాలగేయకారిణులను తలచుకొని, "అజ్ఞాత వాగ్గేయకారిణులైన ఈ మాతృమూర్తులకు తలవంచి ప్రణామం చేయటం ద్వారా మన కృతజ్ఞతలు తెలుపుకుందాం" అంటూ ముగించారు.

తర్వాత "తమిళం"లోని విశేషాలు సోదాహరణంగా విశదీకరించారు. తమిళభాష గురించి, సాహిత్య చరిత్ర గురించి సంక్షిప్తంగా వివరించారు. తమిళ సాహిత్యంలోని ఛందస్సు, మహిళల రచనలు, ముఖ్యంగా ఆండాళ్ 'తిరుప్పావై' గురించి విశేషంగా వివరించారు. జానపద గేయాలను స్థాలీపులాక న్యాయంగా పరిచయం చేశారు.

ఆ తర్వాత కన్నడ విదుషీమణుల గురించి, ముఖ్యులైన కంతి (ప్రథమ కన్నడ కవయిత్రి), దేవర దాసిమయ్య భార్య దుగ్గలె, నాగలాంబిక, గంగాంబిక, నీలాంబికల రచనలు పేర్కొన్నారు. కేలవ్వె, లింగమ్మ, కేటలాదేవి లాంటి వారలను పరిచయం చేశారు. అక్క మహాదేవి రచనలను మాత్రం సోదాహరణంగా విశ్లేషించారు. ఇంకా కొందరు కవయిత్రులను పేర్కొని, "కన్నడ రచయిత్రుల రచనల్లో తమిళంలో లాగా సంగీత, సాహిత్య సమ్మేళనం లేదని, విషయంలో నిజాయితీ మాత్రం ఉంద"ని చెప్పడం రచయిత్రి నిష్పక్షపాత ధోరణికి చక్కని విశ్లేషణకు తార్కాణం.

"మలయాళం" భాషలో ప్రాచీన కవయిత్రుల పేర్లు లభించడం లేదని, కాని స్త్రీ రచనలుగా చెప్పదగినవి కొన్ని ఉన్నాయని చెప్పి, ఆధునిక వాగ్గేయకారిణులైన బాలమణి, మాధవి అమ్మ మొదలైన వారి పేర్లు పేర్కొన్నారు.

"వేదకాలం నాడు సంఘం సర్వస్వతంత్రమైనది. నాటి ఋషికల రచనలన్నీ సంఘాన్ని, జీవనవిధానాన్ని ఉద్దేశించి రాసినవే!" అంటూ "తెలుగు సాహిత్యానికి సంబంధించినంతవరకు సమాజం పట్ల తమ బాధ్యతను విదుషీమణులు మర్చిపోయినట్లు కన్పిస్తున్నది"–అని నొచ్చుకున్నారు. "దక్షిణ భారతదేశంలో సాంఘిక స్పృహ తమిళ కవయిత్రులకు ఎక్కువ అని చెప్పక తప్పదు" అన్నారు. "కన్నడ కవయిత్రులు కడ జాతి వారుగా కన్పిస్తున్నారని, వారిపట్ల చూపిన అన్ని రకాల వివక్షలను ఎదిరించార"ని విశ్లేషించారు. "మలయాళ సాహిత్యంలో కవయిత్రులు చాలా తక్కువగా కనిపిస్తున్నారని,



మలయాళ భాషా సాహిత్యాలకు సంబంధించి నా పరిశోధన పెద్దగా సాధించినదేమీ లేదు" అని నిజాయితీగా విన్నవించుకున్నారు కృష్ణకుమారిగారు. దక్షిణాది కవయిత్రులు ఏ లక్షణాలు అలవరచుకుంటే సమాజం అభివృద్ధి చెందగలదో తమ గేయాల ద్వారా తెలిపారని, వ్యావహారిక భాషా శైలినే వారు తమ గేయాలలో పొందుపరిచారని నిర్ధారణగా చెప్పారు.

డా. వై.కృష్ణకుమారిగారు తమ పరిశోధనా పత్రంలో – "పూర్వపు స్త్రీ ఔన్నత్యం మధ్యకాలంలో తగ్గిందని, నేడు మళ్ళీ దాన్ని పునరుజ్జీవింప చేయాల"నే ఆకాంక్షను, ఆశను వెలువరించారు. మొత్తం మీద రచయిత్రి ఆయా ప్రాంతాల్లో పర్యటించి, విషయ సేకరణ చేసి "దక్షిణ భారత" భాషల కవయిత్రుల సంగీత సాహిత్య సౌరభాలు" తెలుగు జాతి ఆఘ్రాణించేట్టుగా చేయడం బహుధా అభినందనీయం. భావి పరిశోధకులకు ఈ గ్రంథం కరదీపికగా నిలువగలదని భావిస్తూ రచయిత్రిని మనసా, వాచా అభినందిస్తున్నాను.

–బి.జయరాములు
సంపాదకుడు



"చుట్టూరా ఆవరించుకొని వున్న
చీకటినితిట్టుకుంటూ
వూరికే కూర్చోవడం కంటే,
ప్రయత్నించి ఎంత చిన్న దీపాన్నయినా
వెలిగించడం మంచిది"

*ఈ వాక్యమే మా యువభారతి ఊపిరి*

# ఆశీస్సులు

డా. కృష్ణకుమారి రచించిన 'దక్షిణ భారత వనితా వాగ్గేయ వాఙ్మయం' అనే పుస్తకం కూలంకషంగా చదివాను. వేదకాలం నుండి మొదలు పెట్టి ఇటీవలీ కాలం వరకు ఉన్నట్టి విదుషీమణుల గురించి చాలా లోతుగా పరిశోధించినట్లు అర్థం అయింది. ఇది సంస్కృతంతో బాటు దక్షిణ భాషలైన తెలుగు, తమిళం, కన్నడం, మలయాళంలో గల విదుషీమణుల వైదుష్యం గురించి రచించిన విలక్షణ గ్రంథం. జన బాహుళ్యంలో లేని ఎన్నో విషయాలు ఇందులో కనిపిస్తాయి. ఇది కృష్ణకుమారి తులనాత్మక పరిశీలనా దృష్టికి నిదర్శనం.

మొదటగా సంస్కృతంలోని ఋషికలనబడే మహిళలు రచించిన శ్లోకాలను ఎత్తిచూపింది. అందులోని భాషతో బాటు వారి సున్నితత్వం, సమాజ శ్రేయస్సు కూడా వివరించింది. సంస్కృతం సహజంగా సంగీత మయమైన భాష. సాహిత్యం, సంగీతం ఒకదానితో ఒకటి కలిసిపోయి ఉండడం మనం గమనించవచ్చు. కాబట్టి ఈ శ్లోకాలు సంగీతాత్మకమైన రచనలు అనడంలో సందేహం లేదు.

ఇక తెలుగు సాహిత్యం విషయానికొస్తే, కుప్పాంబిక అనే రచయిత్రి ఉందన్న విషయం తెలియజేయడం ముదావహం. తాళ్ళపాక తిమ్మక్క రచనలు సాహిత్య లోకంలో అందరికీ పరిచయమే. కానీ అందులోని సంగీతం గురించి వివరించడం నాకు చాలా సంతోషాన్ని ఇచ్చింది. మొల్ల రచించిన సీస పద్యాలలోని విభిన్నమైన నడకలు కర్ణాటక సంగీత తాళానికి అన్వయించి చెప్పడం , పసుపులేటి రంగాజమ్మ రచన అయిన 'మన్నారుదాస విలాసం'లో పద్యాలని ఉదాహరిస్తున్నప్పుడు చెప్పిన విశేషాలు కృష్ణకుమారి తాళ పరిజ్ఞానానికి మచ్చు తునక. 'రాజ నిభాననా!' అన్న పద్యం చూడండి! చివరన బాల గేయాలు గురించి చదువుతున్నప్పుడు చాలా ఆశ్చర్య పోయాను. నిజానికి మనం ఎప్పుడూ జోలపాటలు పాడే తల్లుల గురించి ఆలోచించం. కుటుంబ వ్యవస్థ తొలినాళ్లలోని ఆ మాతృమూర్తులను తొలి వాగ్గేయకారులుగా పరిచయం చేసిన కృష్ణకుమారి సున్నితపు మానసిక కోణానికి నా జోహార్లు.



ఇక తమిళ సాహిత్యం విషయానికొస్తే అపారమైన సమాచారం లభించడం గమనించవచ్చును. సంగం యుగం నుంచి ముఖ్యంగా నాటి మహిళల సమాజ సంస్కరణ దృక్కోణం వారి రచనలలో మనం గమనించవచ్చును. తమిళ భాష గురించి చెబుతున్న సందర్భంలో ఛందో విశేషాలు, నాటి రచనలలో ఆయా ఛందస్సు వాడిన పద్ధతి గురించి కృష్ణకుమారి ఇచ్చిన సమాచారం చదివితే ఆమె పరిశోధనలోని గాఢత అర్థం అవుతుంది. తమిళ విదుషీమణుల సంగీత సాహిత్యాలకు సంబంధించిన అపూర్వజ్ఞానం అభినందనీయం. అందులోనూ గోదాదేవి పాశురాలు నేటికీ నిలిచిన గొప్ప రచనలు. ధనుర్మాసంలో మేము సామూహికంగా పాశురాలు దేవాలయంలో ఆలపిస్తాము. భక్తితో బాటుగా ఆ రచనల సంగీత సాహిత్యాల గొప్పతనమే నేటికీ వాటి ఉనికికి కారణం.

ఇక్కడ నన్ను ఆకర్షించిన ఒక విషయం గురించి చెబుతాను. ఏ భాషా సాహిత్యానికైనా జానపద సాహిత్యమే పునాది . తమిళ భాషకి సంబంధించి ఈ అంశాన్ని స్పృశించడం చాలా బాగుంది. సున్నితమైన ఆ పాటలు మన మనస్సులను ఆకట్టుకుంటాయి. ఇది కూడా తన పరిశోధనాసక్తిని తెలియబరుస్తున్నది.

కన్నడ సాహిత్యంలో ఉదాహరించిన మహిళలు, వారి సాహిత్య సేవ చాలా ప్రశంసనీయం. ఈ రచనలు చేసిన వారి నేపథ్యం గమనిస్తే వారి రచనాశక్తికి తలవంచవలసినదే. వీరి రచనలను కృష్ణకుమారి ఏ తవ్వకాల నుంచి వెలికితీసిందో కానీ ఇది గొప్ప పరిశోధన. ఇక్కడ అనుకున్నంత సంగీత ఛాయలు లేవు. దీనికి వారి నేపథ్యమే కారణమేమో! ఇక్కడ ముఖ్యంగా చెప్పుకోదగిన వ్యక్తి అక్క మహాదేవి. మేము ఎన్నో కచేరీలలో చివర అక్క మహాదేవి రచనలు గానం చేస్తాము. చదువుతుంటే వచనం అనిపించినా సంగీతానికి అనువుగా ఉండే రచనలు అవి. హొన్నమ్మ, గిరియమ్మ రచనలు కూడా చాలా హృద్యంగా ఉంటాయి. నేటికీ వీరి రచనలు అక్కడి ప్రజల నాల్కలపై నడయాడుతాయి అని వింటున్నాము.

మలయాళం సాహిత్యంలో చెప్పుకోదగిన రచనలు లేవు అనడం నిజంగా ఆశ్చర్యపరిచే విషయమే. నిజానికి ఈ ప్రాంతంలో మహిళల స్థానం చాలా ప్రధానమైనది. చరిత్ర కూడా ఇదే చెబుతున్నది. ఇంత లోతుగా పరిశోధన చేసిన కృష్ణకుమారికి ఏమీ దొరకలేదు అంటే అది విచిత్రమే. కానీ నిజం కూడా.

చివరగా ఉపసంహారంలో పరిశోధకురాలు చెప్పిన అంశాలు నిజంగా మనను ఆలోచింపచేస్తాయి.నిజాయితీగా చెప్పిన ఈ అంశాలలో ఆవేదన కూడా అంతర్లీనంగా

గోచరిస్తుంది. చదివితే మీరు కూడా ఇదే అభిప్రాయానికి వస్తారు. సంపూర్తిగా చదవండి. సాహిత్య చరిత్రలో కవయిత్రులకు సంబంధించి ఒక కొత్త కోణాన్ని దర్శింపచేసిన కృష్ణకుమారికి ఆ పరాశక్తి ఆశీస్సులు సర్వదా ఉండాలని కోరుతున్నాను.

కృష్ణకుమారి చాలా పిన్న వయస్సు నుండే నాకు పరిచయం. శ్రీ త్యాగరాజ స్వామి ఆరాధన సందర్భంగా విద్యానగర్ రామాలయంలో ఏడురోజుల పాటు సంగీత సభలు జరిగేవి. అక్కడ తను గానం చేయడం నాకు తెలుసు. ఆ సంగీతమే మమ్మల్ని కలిపింది. ఉన్నత సంప్రదాయం ఉన్న కుటుంబం నుంచి వచ్చిన డా.కృష్ణకుమారికి సంగీత సాహిత్యాలలో సమానమైన ప్రవేశం ఉంది. సత్ప్రవర్తన, సంస్కారంతో బాటు కోకిల గానం ఆమె సొత్తు. తత్త్వచింతన, భక్తి, పెద్దల ఎడ గౌరవమర్యాదలు పుష్కలంగా గల డా.కృష్ణకుమారి ఇటువంటి ఉన్నత రచన చేయడం సముచితం.

చాలా శ్రమించి రచించిన ఈ గ్రంథాన్ని అందరూ చదివి మన విదుషీమణుల గొప్పతనాన్ని గురించి తెలుసుకోవాలని ఆశిస్తున్నాను. ఆ పరాశక్తి అనుగ్రహంతో ఈ పుస్తకానికి ప్రాచుర్యం రావాలని దీవిస్తున్నాను.

ఇట్లు

శుభకృత్ ఆశ్వీయుజ శుద్ధ పాడ్యమి
సెప్టెంబర్ 26, 2022
దల్లాస్, అమెరికా

బుధ జన విధేయురాలు
నూకల సేతు మాధవి
కర్ణాటక సంగీత విద్వాంసురాలు





# నా మాట

'వాగ్గేయకారులు భక్తి సంగీత సంప్రదాయాలు – ప్రయోగాలు' అన్నది నా పి.హెచ్‌డి. అంశం. ఈ అంశం మీద పరిశోధన చేస్తున్నప్పుడు నాకు ఈ అంశంలో ఎక్కడో ఏదో లోపం ఉంది, కాని స్పష్టంగా తెలియటం లేదు అన్పించింది. కాలం గడుస్తున్న కొద్ది ఆ లోపమేదో అవగాహన అయ్యింది. ప్రకృతి తన సంతానానికి అవకాశాలు సమానంగానే ఇచ్చింది. అయితే అందరూ వాటిని సరిగ్గా అందుకోలేకపోయారు. కొంత అలసత్వం, కొంత నిర్లక్ష్యం, కొంత అజ్ఞానం, కొంత అహంకారం, కొంత అమాయికత్వం, కొంత తెలియని తనం. కారణమేదైనా స్త్రీ పురుషులకి సమానత్వం చాలా విషయాలలో లేదు. సంగీత సాహిత్య రచనలు చేసిన వారందరూ ఇంతవరకు పురుషులే. స్త్రీలెందుకు ఈ రంగంలో అడుగు పెట్టలేదు అన్న ఆలోచన మొదలైంది నాకు.

పరిశోధన కొనసాగించగా ఎందరో స్త్రీలు వాగ్గేయకారిణులుగా దర్శనమిచ్చారు. మరి వారు తెరమీదకు రాలేదు ఎందుకని? ఏ కారణంగా స్త్రీలు వెనుకడుగు వేశారు అన్నది విశ్లేషించుకుంటే భవిష్యత్తులో ఆ తప్పు చేయకుండా ఉండొచ్చుకదా! అంతేకాదు, గతాన్ని తిట్టుకుంటూ కూర్చొనేకంటే గతంలోని మంచిని గ్రహించి అది పునాదిగా ముందుకు సాగవచ్చునని అన్పించింది. అందుకే సంగీత సాహిత్యాల సమ్మిళితమైన గేయాలను రచించిన స్త్రీల గురించి మొదట తెలుసుకున్నాను. తర్వాత వారి గేయాలలోని సంగీతాన్ని, సాహిత్యాన్ని విడివిడిగా విశ్లేషించాను. చాలా చక్కటి, చిక్కటి రచనలవి. నిష్కారణంగా కాలగర్భంలో కలిసిపోవలసిందేనా? చాలా బాధ అన్పించింది. ఎంతో కొంత ప్రయత్నం చేసి కొన్నింటినైనా వెలుగులోకి తెచ్చి, వాటి సంగీత సాహిత్య విలువలను నేటి సమాజానికి పరిచయం చేద్దామని నిర్ణయించుకున్నాను. దాని ఫలితమే ఈ పరిశోధన.

ఈ సందర్భంగా దక్షిణ భారత రాష్ట్రాలు నాలుగు – తెలుగు, తమిళ, కన్నడ, మలయాళ ప్రాంతాలు తిరిగాను. పెద్దవారిని, వృద్ధులని, పండితులని కొంతమందిని కలిశాను. వారు చెప్పగా, పాడగా విని రికార్డ్ చేసికొని ఈ పుస్తకం రచించాను. అయితే ఇది సమగ్రమైనది అని నేను చెప్పుకోవటం లేదు. దీనిమీద ఇంకా లోతుగా పరిశోధన జరగటానికి ఎంతో అవకాశం ఉంది. నేను ఈ పరిశోధనని ఆరంభించాను,

ఉత్సాహవంతులైన వారెవ్వరైనా ఈ పరిశోధన కొనసాగించి మరికొంత సమాచారాన్ని సేకరించవచ్చును. ఇదే పద్ధతిలో నేను 'బౌద్ధసాహిత్యంలో స్త్రీల రచనలు' అన్న అంశం మీద కూడా పరిశోధన చేశాను. ఎంతో ఆసక్తికరమైన విలువైన సమాచారం లభించింది. భవిష్యత్తులో పరిశోధనకు చాలా వీలుగల అంశం అది.

ప్రపంచంలో భారతదేశానికొక ప్రత్యేకత ఉంది అని పదేపదే చెప్పటం కంటే ఆ ప్రత్యేకత ఏంటో మనం ఆధికారికంగా చూపించగలగాలి. అందులో భాగంగానే ఈ పరిశోధన చేపట్టడం జరిగింది. చరిత్రకెక్కక పోయినా చరిత్ర సృష్టించిన స్త్రీలు అనాదిగా మనదేశంలో ఉన్నారు అన్న విషయం ప్రపంచానికి తెలియటం చాలా అవసరం. స్త్రీ శక్తి స్వరూపిణిగా విగ్రహరూపంలో పూజలందుకోవడం మాత్రమే కాదు, సంఘ సంస్కరణ దృష్టిగల ఒక మానవతామూర్తిగా కన్పించాలి అన్నది నా భావన. ప్రాచీన కాలంలో విదుషీమణులైన స్త్రీలు మనకిట్లా దర్శనమిచ్చారు. ఆ స్ఫూర్తిని తీసుకొని నేటి సమాజంలోని స్త్రీలు మరింత ముందుకు పోవాలి. ఈ భావనతో నేను మానవతామూర్తులైన విదుషీమణులైన, నిర్భీతితో తమదైన దారిలో ముందుకు పోతూ తర్వాతి తరాల వారికి మార్గదర్శకులైన స్త్రీల గురించి రచించిన సమాచారాన్ని మీ ముందు పెడుతున్నాను. సహృదయులైన పాఠకులు దీనిని ఆదరిస్తారని ఆశిస్తున్నాను.

ఈ పుస్తకాన్ని చక్కగా దిద్దితీర్చిన 'పుస్తక శిల్పి' శ్రీ తాళ్లపల్లి మురళీధర్ గౌడు గారికి, అందంగా ముద్రించిన కర్షక్ ఆర్ట్ ప్రింటర్స్ వారికి, డిటిపి చేసిన ఉల్లి కాంతారావు గారికి, 'లేఅవుట్ చేసిన మనుగ్రాఫిక్స్ కుడుపూడి భాస్కర్‌రావు గారికి సహృదయంతో ప్రచురించిన యువభారతి వారికి కృతజ్ఞతలు.

–డా॥ వై. కృష్ణకుమారి



# విషయ సూచిక





# గతంలో ...

చతుష్షష్టి కళానిలయం మన భారతదేశం. ఈ కళలన్ని పంచేంద్రియాల ద్వారానే కాకుండా జ్ఞానేంద్రియాల ద్వారా కూడా ఆనందాన్ని కల్గిస్తాయి. ఈ పరమానందమే మానవ మనస్సుకు, మేధస్సుకు కూడా ప్రశాంతత చేకూరుస్తుంది. ఈ శాంతి, ఆనందం లేని మానవ జీవితం వ్యర్థం. కళల్లో ముఖ్యంగా సంగీతం ఆపాత మధురమైంది. *శిశుర్వేత్తి పశుర్వేత్తి వేత్తి గాన రసం ఫణిః* అన్న సూక్తి వలన గానం సర్వప్రాణికి ఆకర్షణీయమైనదని తెలుస్తోంది. జీవితంలోని ప్రతి మలుపులో దీని ఉనికి ప్రత్యక్షమవుతూనే ఉంటుంది. నిజానికి సంగీతం మౌఖిక విద్య. సమాజం వికసిస్తున్న కొద్ది నాదవిద్య కూడా సమాంతరంగా అభివృద్ధి చెందింది.

భారతీయ విజ్ఞానానికి మూలకందాలైన వేదాలతోపాటు నాదవిద్య వికాసం జరిగింది. ముఖ్యంగా వేదాలు స్వర ప్రాముఖ్యం కలవి. వేదాలలో ఎన్నో చోట్ల మనకు సంగీత ప్రశంస కన్పిస్తున్నది. వేదాధ్యయనం ఏయే స్వరాలతో, ఏయే సమయాలలో జరగాలో చెప్పబడింది. ఆ కాలంలో ఉపయోగించిన వాయిద్యాల వివరాలు కన్పిస్తాయి. ఆ కాలంలో వచ్చిన వేదాలు, ఉపనిషత్తులు, బ్రాహ్మణాలే కాకుండా తర్వాత వచ్చిన ప్రాకృత గ్రంథాలు ముఖ్యంగా గాథాసప్తశతిలో కూడా సంగీత ప్రశంస కన్పిస్తోంది. పురాణాలు సంగీతాన్ని ఇతోధికంగా పోషించాయి. ఈ కాలంలో ఎన్నో ఉత్సవాలలో సంగీతం నేపథ్యంగా ఉండటాన్ని మనం గమనించవచ్చు. తత్ఫలితంగా లక్షణ గ్రంథాలు రావడం మొదలైంది.

శాస్త్రం బాగా తెలిసిన లక్షణకారులు లక్షణ గ్రంథాలు రాసారు. చరిత్రకు అందినంత వరకు మొదటి లక్షణ గ్రంథం భరతుని "నాట్యశాస్త్రం". ఇది చాల సమగ్రమైన గ్రంథం. 32 అధ్యాయాలు గల ఈ గ్రంథం చర్చించని విషయం లేదు. దీని ఆధారంగా తర్వాత ఎన్నో ఉత్తమ లక్షణ గ్రంథాలు వచ్చాయి. ప్రకృతిలోని పక్షుల, జంతువుల అరుపులతో సప్తస్వరాలకు సామ్యం ఉందని ఈ లక్షణ గ్రంథాలు వెల్లడి చేశాయి. అంతేగాదు, సంగీతం వేదాలలో ప్రవేశించక ముందే స్థానిక ఆటవిక జాతులలోని సంగీతాన్ని గుర్తించి, ఆ రాగాలను ప్రచారం చేసాయి. అవి నేటి రాగాలకు మాతృకలైనాయి. మారుతున్న సమాజానికి అనుగుణంగా ఎన్నో మార్పులను సమన్వయపరుస్తూ ఎంతో విలువైన సమాచారాన్ని అందించాయి ఈ లక్షణ గ్రంథాలు. ఈ లక్షణ గ్రంథాలలోని లక్షణాలకు లక్ష్యాలుగా నాదోపాసకులైన వాగ్గేయకారులు ఎంతో హృద్యమైన రచనలు చేశారు. ధాతుమాతు నిర్మాణ దక్షుడు వాగ్గేయకారుడనబడతాడు. ఇట్లాంటి దక్షత గల వాగ్గేయకారులకు సంగీత చరిత్రలో ఒక ప్రత్యేకత ఉంది. ఏ వాగ్గేయకారుని రచన చూసినప్పటికి ఆ భావన మన మనస్సుకు చాలా దగ్గరగా ఉన్నట్లు అనిపిస్తుంది. ఆ కీర్తన భావనలో మనం తాదాత్మ్యం చెందుతాం. దానికి ముఖ్యకారణం ఆయా వాగ్గేయకారులు తమతమ రచనలలో ప్రదర్శించిన భక్తి భావనయే.

ఈ విషయంలో స్త్రీలు వెనుకంజ వేయలేదు. తమకెన్ని కట్టుబాటులు ఉన్నా, పరిస్థితులు అనుకూలించకపోయినా, ఉన్న ఆ కాస్త పరిధిలోనే తమ శక్తిని ప్రదర్శించారు. సంగీత సాహిత్యాలు తమకు అందుబాటులోనివే అని తెలియచెప్పారు. కేవలం గురువు దగ్గర నేర్చుకోవటంతో ఆగిపోకుండా తాము స్వయంగా గేయరచనకు పూనుకున్నారు. వాగ్గేయకార పదం తమకు అన్వయించుకున్నారు. తమ గేయాల ద్వారా స్వానుభవాన్ని జోడించి భగవంతుని మీద కీర్తనలుగా ఒకవైపు, సంఘ సంస్కరణ దృష్టితో ఇంకొకవైపు తమ ప్రతిభను కనబరచారు. అసలు ఈ వాగ్గేయకార పరంపర ప్రాచీన కాలానికే పరిమితం కాలేదు. నేటికీ కొనసాగుతూనే ఉంది. ఆధునికులైన వాగ్గేయ కారులెందరో ఈ పరంపరను కొనసాగిస్తూనే ఉన్నారు. ప్రతిభలో ప్రాచీనులకు సమానంగానే సంగీత ప్రపంచానికి తమ వంతు సేవగా హృద్యమైన రచనలను చేస్తున్నారు. రకరకాల ప్రయోగాలు చేస్తూనే ఉన్నారు.

వేదకాలం నాడు చక్కటి సంస్కృత భాషలో ఋక్కులు రచించారు. సంగీత సాహిత్యాలకు నెలవైన ఆ ఋక్కులు నేటికీ మనకు శిరోధార్యాలే. తర్వాత అనేక కారణాల వలన దేశంలో ఎన్నో స్థానికమైన భాషలు ప్రాచుర్యం పొందాయి.

విదుషీమణులైన స్త్రీలు ఆయా ప్రాంతపు భాషా సాహిత్యాలలో తమ ప్రతిభను చూపించారు.

ఈ పరిశోధనలో దక్షిణ భారతదేశపు భాషలైన తెలుగు, తమిళం, కన్నడం, మలయాళం మాత్రమే తీసుకోవడం జరిగింది. ఇక్కడి భాషా సాహిత్యాలు, సంస్కృతీ సంప్రదాయాలతో సాపత్యం కన్పిస్తుంది. ఆచార వ్యవహారాలలో, పెళ్ళి పేరంటాలలో వీరికి ఆదాన ప్రదానాలున్నాయి. కాబట్టే ఆ అంతస్సూత్రం వీరిని అనేక రూపాలలో కట్టివేసింది. అందుకే ఎన్నో సందర్భాలలో పోలికలు కన్పించే ఈ నాల్గు భాషల భాషా సాహిత్యాలు తులనాత్మకంగా పరిశీలించవచ్చును. ఆ కాలంలోని స్త్రీల రచనలలో కూడా ఎంతో దగ్గరితనం కన్పిస్తుంది. ఈ కారణంగా దక్షిణ భారత భాషలను, ఆ ప్రాంతపు విదుషీమణులను మాత్రమే తీసుకోవడం జరిగింది. ప్రాచీన కాలంలో, ఆయా భాషల సాహిత్యాలలో స్త్రీల రచనలు సంగీత సాహిత్య సమ్మేళనాలు అని నిరూపించటానికి చేసిన చిన్న ప్రయత్నం ఇది.

నది ఉద్గమ స్థానంలో చిన్నగా కనిపించినప్పటికీ క్రమంగా పెద్దదవుతూ అనేక చిన్న ప్రవాహాలను తనలో కలుపుకుంటూ విశ్వరూపం దాల్చి చివరకు సాగరంలో కలుస్తుంది. అనేక రకాల నీరు కలిసినప్పటికి నది తన గుణాన్ని మార్చుకోదు. మానవుల దప్పిక తీర్చడంతో పాటు బంజరు భూములను సస్యశ్యామలం చేస్తుంది. అట్లాగే నాద ప్రవాహం కూడా దప్పిక గొన్న జిజ్ఞాసువులకు స్వాంతన కల్గించి, మోక్షానికి అర్హులుగా చేస్తుంది. చరిత్రకందని కాలంలో ఇది ఉద్భవించినప్పటికీ నేడు ఇదొక విశ్వరూపాన్ని దాల్చిన కళ, శాస్త్రం కూడా. భగవద్దత్తమైన ఈ నాద విద్యను తిరిగి భగవదర్పణం చేశారు మన నాదోపాసకులు. ఆ సంగీత విద్యలో సాహిత్యాన్ని నింపి జనరంజకమైన రచనలు చేశారు ఈ విదుషీమణులు. వారి రచనల సౌరభాలను ఆఘ్రాణిద్దాం.





# సంగీత శాస్త్రం

గానం సమ్మోహనకరమైన విద్య. గానానికి లొంగని శక్తి ఏది లేదు. దేవ మానవ తిర్యగ్జాతులు కూడా గానానికి వశీకరించబడగలవని శాస్త్రకారుల తీర్మానం. "కలౌ గాన ప్రియో హరిః" అన్న సూక్తి సాక్షాత్తూ శ్రీ మహావిష్ణువు కూడా కలియుగంలో గానమంటే ఆసక్తి చూపిస్తాడని తెలుస్తోంది. మందంగా వీచే గాలి, గలగలా పారే ఏరు, ఎగిరే పులుగులు, ఝుంకారం చేస్తూ పూల మీద తిరిగే తుమ్మెదలు, ఆకుల చాటున దాగి కూసే కోయిలలు – ఈ విధంగా సకల ప్రకృతిలో అపురూపమైన లయాన్వితమైన శక్తి దాగి ఉన్నదన్నది సర్వులకు తెలిసిన విషయమే. ఈ అంతర్గత శక్తియే ఒక విద్యగా, ఒక కళగా రూపుదిద్దుకొంది. ఆపాత మధురమైన సంగీతం ఉపాసకునకు, శ్రోతకు జీవన్ముక్తిని కల్గిస్తుంది. భావుకులైన వాగ్గేయకారులు భగవద్భక్తి తత్పరులై, తమ జ్ఞాన భక్తి వైరాగ్యాలను తమ రచనలలో పొదిగి, తద్వారా తమ అనుభవాలను లోకానికి అందించారు. సంగీతాన్ని తమ రచనలలో ఇమిడ్చి చక్కటి గేయాలు సమాజానికి అందించిన వీరి రచనలలో గల సంగీత విద్యకు అసలు మూలమేది? దాని అభివృద్ధి వికాసాలెట్టివి? మొదలైనవి తెలుసుకొనవలసిన ముఖ్యాంశాలు.

**"నాదేన వ్యజ్యతే వర్ణః పదం వర్ణాత్పదాద్వచః**
**వచసో వ్యవహారోఽయం నాదాధీన మతో జగత్"**

***– సంగీత రత్నాకరం – స్వరగతాధ్యాయం – శార్ఙ్గదేవుడు 2వ శ్లోకం.***

నాదము వలన అక్షరమును, అక్షరము నుండి శబ్దములును, శబ్దము నుండి వ్యవహారమును కల్గినవి కనుక లోకములన్నియు నాదస్వరూపంగా ఉన్నవని పై శ్లోకము యొక్క భావం.

ఇటువంటి నాదం ఆధారంగా గల సంగీతకళ జాతి సంస్కృతికి ప్రతీక. ఆదిమానవుడు ఆనందంతో విప్పిన కంఠం నుండి ఉద్భవించిన సంగీతం నాగరికతా వికసనంతో పాటు నగిషీలు దిద్దుకొని ఒయ్యారములు సంతరించుకొని అద్భుతమైన కళగా విరాజిల్లింది. విజ్ఞాన ఖనులనబడే వేదాలు భారతీయ సాహిత్యానికి మూలకందాలు. వేదాలలో మనకు తొలిసారిగా సంగీత విద్యకు ఆధారాలు కన్పిస్తున్నాయి. ఇది ఓంకార సంజనితమని అన్నప్పుడే నాదవిద్య యొక్క ప్రాచీనత అర్థమవుతుంది.

*ఓ మిత్యేతదక్షర మిదగ్ం సర్వం, తస్యోప వ్యాఖ్యానం*
*భూతం భవద్భవిష్యదితి సర్వమోంకార ఏవ*
*యచ్చాన్యత్ త్రికాలాతీతం తదప్యోంకార ఏవ*

– మాండూక్యోపనిషత్తు – రామకృష్ణ మఠం వారి ప్రచురణ 1వ శ్లోకం.

భూత భవిష్యద్వర్తమాన కాలాల్లో ఉన్నదంతా కూడా ఓంకారము. అంటే దృశ్యమానమైన ఈ జగత్తులో ఉద్భవించిన ప్రతీది ఓంకార జనితమే అని శ్లోకార్థం.

పరమ శివుని ఢమరుక ధ్వనితో అక్షరమాలతో పాటు స్వరమాలిక కూడా ప్రపంచానికి అనుగ్రహింపబడిందని విజ్ఞుల అభిప్రాయం. ఎందుకంటే వైదిక మంత్రాలు, ఋక్కులు లయాత్మకంగా ఉన్నాయి. వైదిక ఛందస్సులైన అనుష్టుప్, మందాక్రాంత, గాయత్రి మొదలైన ఛందస్సులు లయాత్మకంగా ఉన్నాయి. అయితే వేదాల కంటే ముందటి కాలంలో మౌఖికంగా, చెల్లా చెదురుగా ఉన్న నాదవిద్య వేదాలలో మొదటిసారిగా సక్రమంగా గానం చేయబడింది. చూడండి. వేదాలలో మొదటిదైన ఋగ్వేదంలో మొదటి మంత్రం ఇది.

*అగ్నిమీళే పురోహితం*
*యజ్ఞస్య దేవం ఋత్విజం*
*హెూతారం రత్న ధాతమం*

ఇది మూడు పాదాల ఛందస్సు. ప్రతీ పాదంలో 8 అక్షరాలు ఉన్నాయి. వేదం స్వర ప్రధానమైనది. వేద పఠనంలో ఉదాత్త అనుదాత్త స్వరితాలు నిర్దిష్టంగా



ఉచ్చరించడం ప్రధానం. లేకపోతే అర్థం భేదం ఏర్పడి, అనర్థం సంభవిస్తుంది. కాబట్టి మొదటి ఋక్కుయైన పై శ్లోకంలోని సాహిత్యం సంగీతం ఒకే కాలంలో ఉద్భవించింది అని చెప్పవచ్చును. నిజానికి వాఙ్మయ రూపమైన భాషకు లయ సహజం. కాబట్టి తొలి సాహిత్యమైన వేదాలు సంగీతావలంబన లేకుండా పొడిపొడిగా చదివారని అనలేం. వైదిక సాహిత్యమంతా కూడా సంగీతానికి ఇతోధిక ప్రాధాన్యాన్ని ఇచ్చింది. అయితే కాలక్రమేణా ఆ సంగీతంలో కొన్ని మార్పులు వచ్చి ఉండవచ్చును.

ప్రాచీన కాలంలో సంగీతం మతపరంగా ఉన్నదనిపిస్తుంది. ఎందుకంటే దేవతలను అర్చించటానికై ఏర్పడినవి ఋక్కులు. ఆ ఋక్కులు సంగీతావలంబమైనవి. ఋక్కుల కంటే ముందు మనకు ఇంకొక రకమైన సంగీతం ఆధికారికంగా లభించలేదు. అందువలన ఈ కాలమంతా సంగీతం మతపరమైనదే అని ఊహించవలసి వస్తుంది. అయితే ఆనాటి సంగీతంలో ఏయే రాగాలు ప్రచారంలో ఉన్నాయో చెప్పలేము. నిజానికి 'రాగం' అనే పదం నాడు వ్యాప్తిలో లేదు. మనకు మొదటిసారిగా 'రాగం' అనే పదం గాని, దాని నిర్వచనం గాని మతంగుని "బృహద్దేశిలో" కన్పిస్తుంది. 'రంజన' అన్న పదమాధారంగా ఉద్భవించిన ఈ పదానికి కొన్ని ప్రత్యేక స్వరాల సమూహం అని అర్థం. అంటే ఆ ప్రత్యేకమైన స్వర సముదాయం వలన శ్రోతకొక భావము, ఒక రూపము ఏర్పడుతుంది. ఆ చిత్త వృత్తి కల్గించేదే రాగం.

వేదాలలోని ఋక్కులను మొదట ఒకే స్వరంలో గానం చేసేవారట. తర్వాత మూడు స్వరాలతో గానం చేసే 'సామిక' అనే పద్ధతి ఏర్పడింది. ఈ మూడు స్వరాలకు ఇంకొక రెండు స్వరాలు కలిసి ఐదు స్వరాలతో గానం చేసే ఔడవ గాన పద్ధతి ఏర్పడింది. గ,రి,స,ని,ద అన్నవి ఈ ఔడవ స్వరాలు. తర్వాత కాలంలో ఈ ఐదు స్వరాలకు మ, ప అనే స్వరాలను ఆద్యంతాలుగా జోడించగా సంపూర్ణ స్వర సోపానం ఏర్పడింది. అయితే ఈ స్వర మూర్చన నేటి మూర్చన కన్నా కొంత విలక్షణంగా ఉంటుంది. ఈ స్వరాలను కృష్ట, మంద్ర, అతిస్వర్య, చతుర్థ, తృతీయ, ద్వితీయ, ప్రథమ అను సంజ్ఞలతో వ్యవహరించేవారని నారదీయ శిక్ష తెలిపింది. నిజానికి స్వరాలు ఏడు మాత్రమే, కాని వాటి అనేక రకాలైన మేళనల వలన ఎన్నో వందల రాగాలు ఉద్భవించాయి. వాటికి క్రమంగా పేర్లు ఏర్పడ్డాయి. ఒక్కొక్క రాగం ఒక్కొక్క

చిత్తవృత్తి కలది. దీనికి కారణం వాటి కేర్పడిన ప్రత్యేక స్వరసముదాయమే. తర్వాతి కాలంలో కొన్ని జనక రాగాలుగా రూపొంది, ఆ జనక రాగమాధారంగా ఎన్నో జన్య రాగాలు ఉద్భవించి రాగ ప్రపంచాన్ని రాగరంజితం చేశాయి. శంకరాభరణం, తోడి, కళ్యాణి, భైరవి వంటి జనక రాగాలు తమ పరిధిని ఎంతగానో విస్తరింపచేసుకున్నాయి. ఒక్కొక్క రాగం రోజుల కొద్ది పాడినప్పటికీ తరగని స్వరసంపదను కల్పించుకున్నాయి. వాగ్గేయకారులెందరో రాగాల స్వరూపాలను ఎంతో బాగా తీర్చిదిద్దారు. ఈ రకంగా రాగం యొక్క అభివృద్ధి జరిగినది.

ఋగ్వేదం, యజుర్వేదం కాలంనాటికి సంగీతం ప్రచారంలో ఉన్నప్పటికీ సామవేదం ప్రత్యేకించి సంగీతాభివృద్ధి చేసింది. ఎందుకంటే ఈ కాలం నాటికే సప్తస్వరాలతో గానం చేసే పద్ధతి ప్రచారంలో ఉంది. అసలు 'సామ' అంటేనే సంగీత సంబంధి. సా అంటే గద్యమని, మ అంటే స్వరమని అర్ధము. సంగీతావలంబనంగా గానం చేయబడే స్తోత్రాలు గాయకుని వైలక్షణతను తెలియచెప్పుతున్నాయి. ఉదాత్త అనుదాత్త స్వరాలు సంగీతమందలి హెచ్చుతగ్గులను, ఆ ప్రత్యేక శబ్దానికున్న విలువను చెప్పటమే గాక సామవేద గాయకుని లయజ్ఞానాన్ని కూడా ప్రకటిస్తున్నాయి.

ఈ కాలపు సంగీతం గురించి డా॥రాఘవన్ గారు ఇట్లు అభిప్రాయపడ్డారు. "వైదిక కాలం, గంధర్వకాలం, దేశిగాన కాలం అని మూడు భాగాలుగా సంగీత చరిత్రను విభజింపవచ్చును. ప్రాథమిక సంగీతం వేదకాలంలో కన్పిస్తుంది. ఆ ప్రాథమికమైన సంగీతానికి సామవేదం ప్రాతినిధ్యం వహిస్తుంది. భరతుని నాట్య శాస్త్రావరతరణతో ఆ ప్రాథమిక దశ గడచి, గంధర్వ కాలంలోకి సంగీత విద్య అడుగు పెట్టింది. సంగీత కళ చాలా అభివృద్ధి చెందింది ఈ కాలంలోనే. రాగ రాగిణుల భావన, జనకజన్య రాగాల ఉద్భవము జరిగింది ఈ కాలంలోనే. పురాణాలు ప్రాచుర్యం పొందిన ఈ కాలంలో సంగీతం బహుధా విస్తరించింది. గాంధర్వ లేదా మార్గ సంగీత కాలం భరతునికి, మతంగునికి మధ్యకాలం నాటిది. మతంగుని బృహద్దేశిలో దేశిగాన పద్ధతి వ్యాప్తి చెందింది. ప్రస్తుత కాలంలోని సంగీతానికి ముడిసరుకు లాంటి సంగీతం మతంగుని కాలం నుండే ప్రచారం పొందింది".



ఋగ్వేదం నాటికే దాదాపుగా 15 రకాలైన ఛందస్సులలో స్తోత్రం చేసేవారట. వేదకాలం సంగీత సాహిత్యాల సమ్మేళన కాలం. వేదాలలోని ఋక్కులందు గల సాహిత్య విలువలు ఎంత ఉన్నతమైనవో అందులోని సంగీతపు వైశిష్ట్యత కూడా అంతే ఉన్నతమైనది. సంగీత సాహిత్యాలు రెండు కలిసినప్పుడే సమగ్రమైన రూపం ఏర్పడుతుంది. ఒకకీర్తన యందు సాహిత్య భావం, ఆ రాగ భావంతో మిళితమైనపుడే ఒక పరిపూర్ణత ఏర్పడి దానికి లయ తోడై శ్రోతల మనస్సులను అలరింపచేయగలదు. సాహిత్యం లేని స్వరసంపుటి గాని, విస్తారమైన రాగం ప్రస్తారం మాత్రమే గల స్వల్ప సాహిత్యపు తునక గాని శోభించవు. రాగ భావం, సాహిత్య భావం సరిసమానంగా జత కూడినప్పుడే ఆ గానం శ్రోతల చిత్తాన్ని రంజింప చేయగలదు. 'శిశుర్వేత్తి పశు ర్వేత్తి వేత్తి గాన రసం ఫణిః' అన్న సూక్తి కేవలం రాగానికే ప్రాధాన్యమిచ్చినప్పటికీ అది సమగ్రమైన సంగీతమని అనిపించుకోదు. రఘువంశంలో కాళిదాసు ఈ అభిప్రాయమును అత్యద్భుతంగా వివరించారు.

*వాగర్థావివసంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే*
*జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరః ॥*

శబ్దం లేని అర్థం, అర్థం రాని శబ్దం అసమగ్రమైనవి. అర్ధనారీశ్వర తత్వాన్ని ఈవిధంగా భావించాడు కవి కులగురువు కాళిదాసు. ఈ అభిప్రాయాన్ని సంగీత సాహిత్యాలకు అన్వయించవచ్చును. సంగీత సహాయము లేని సాహిత్యం, సాహిత్యావలంబన లేని సంగీతం అసమగ్రమైనవి. ఈ భావన మనకు వేదాలలో కూడా కన్పిస్తుంది. మొదట మంత్ర రచన జరిగి, ఆ తర్వాత సంగీతపు కూర్పు ఏర్పరచుట అన్నది జరగలేదు. ఈ రెండు సమాంతరంగా జరిగాయి.

వేదాలకు సంబంధించిన ప్రాతిశాఖ్యలలో కూడా ప్రాచీన సంగీతం గురించిన అమూల్య సమాచారం ఉంది. 'సామిక' స్వరమైన రి,ని,స లను వరుసగా ఉదాత్త, అనుదాత్త, స్వరిత అని వ్యవహరించటం ఇందులో కన్పిస్తుంది. ఇందులోని స్వరిత స్వరం మిగిలిన రెండింటి కన్నా ఘనమైనది. ఎందుకంటే ఈ స్వరం తనకంటే ముందు రెండు స్వరాలకు, తన తర్వాత రెండు స్వరాలకు ఆధారమైంది. ఈ కాలంలోనే స్వరాలు మృదువుగాను, తీక్షణంగాను పలికే పద్ధతి ఏర్పడింది. ఈ పద్ధతే తర్వాతి

కాలంలో కోమల తీవ్ర స్వరాలుగా రూపొందాయి. స్వరాలు మూడు స్థాయిల్లో అంటే విలంబితం, మధ్య, దురితంగా పాడే పద్ధతికి ఈ కాలంలోనే పునాది పడింది. విద్యార్థులు విద్య నేర్చుకునే పద్ధతి విలంబ కాలంలో జరిగేది. స్వరాల ఊనిక కంఠంలో సక్రమంగా, సరియైన స్థానంలో నిలవటానికి ఈ విలంబిత పద్ధతి ఎంతో అనువైనది. ఎంత విలంబిత కాలంలో సాధన చేస్తే స్వరస్థానాలు అంత బలంగా కంఠంలో నిలిచిపోతాయి. మధ్యలయ యజ్ఞాదులలో ఉపయోగించే వారట. స్వరజ్ఞానం బాగా ఏర్పడ్డాక సాధన చేసే సమయంలో ధృతలయను విద్యార్థులు ఉపయోగించేవారు. దీనివలన ఎంత దురితంగా పాడినప్పటికి స్వరస్థానం తప్పకుండా, తడబాటు లేకుండా గానం చేయడానికి వీలుంటుంది. ఈ మూడు పద్ధతులే గాక మంద్ర, మధ్య, తార స్థాయిలలో గానం చేసే ఇంకొక పద్ధతి కూడా ఈ కాలంలోనిదే. ఈ మూడు స్థాయిలు వరుసగా ఉదరం, కంఠము, శిరస్సు నుండి ఉద్భవిస్తాయి. ఇవి సంగీత సాధకులకు విదితమే.

వేదాల తర్వాత ఉపనిషత్తులు సంగీతాభివృద్ధిని ఎంతగానో ప్రోత్సహించాయి. బ్రాహ్మణాలలో కూడా సంగీత ప్రశంస ఉన్నది. స్వర వర్ణన సంవిధాన బ్రాహ్మణంలో చాలా వివరంగా కన్పిస్తోంది. సంగీత సహాయంతో వేదాలు ఎట్లా గానం చేసేవారో ఈ బ్రాహ్మణం చెపుతుంది. స్వరాల పుట్టుక, స్వరాల ప్రవృత్తి కూడా ఇందులో వివరించబడింది. అనాదిగా ప్రచారంలో ఉన్న అనేక వాయిద్యాల గురించి కూడా ఇందులో చెప్పబడింది.

సంగీతాభివృద్ధి గురించి శిక్షా శాస్త్రాలు కూడా వివరించాయి. నారదీయ శిక్ష, పాణినీయ శిక్ష, యాజ్ఞవల్క్య శిక్ష ఇందులో ముఖ్యమైనవి. ఈ మూడు గ్రంథాలు సంగీత శాస్త్రం గురించిన పూర్తి వివరాలు ఇచ్చాయి. అతి కఠినమైన వేదాధ్యయన భాగాలు ఏవిధంగా గానం చేయాలో ఇవి వివరించాయి. స్వరాల పుట్టుక, వాటి ప్రవృత్తి, రెండు స్వరాల మధ్యగల సంబంధము, అంతరము మొదలైన వాటి గురించి ఇవి వివరించాయి. స్వరాల విలువలను ఆనాడే నారదీయ శిక్ష నిర్ణయించింది. అంతేగాదు సప్తస్వరాలు ప్రకృతిలోని జంతువుల, పక్షుల అరుపులతో సామ్యం కలిగి ఉన్నాయని ఈ రకంగా చెప్పింది.

*మయూర చాతకక్రౌంచ కోకిల దర్దుకాః*
*గజశ్చ సప్త షడ్జాది నక్రమాది దుశ్చారయన్నపి*

– నారద శిక్ష – పేజి – *5.*

స-మయూరం, రి-చాతకం, గ-మేషం, మ-క్రౌంచం, ప-కోయిల, ద-మండూకం, ని-ఏనుగు యొక్క నాదాన్ని పోలి ఉంటుంది అని ఈ శ్లోకార్థం.

పాణిని మహర్షి తన శిక్షా గ్రంథంలో హ్రస్వ దీర్ఘ ప్లుతముల గురించి, మూడు స్వరాలతో పాడే ఋక్కులను, ఏడు స్వరాలతో పాడే సామములను గురించి, వాటి మధ్యగల తేడాల గురించి వివరించాడు. నిజానికి ఉదాత్త, అనుదాత్త స్వరిత స్వరాలలోనే మిగిలిన స్వరాలు నిక్షిప్తమై ఉన్నాయని అన్నాడు.

ప్రాణానల సంయోగం వల్లనే నాదముద్భవిస్తుందని పాణిని చెప్పాడు. ఈ భావాన్నే త్యాగయ్య సారమతి రాగంలో మోక్షము గలదా అన్న కీర్తనలో 'ప్రాణానల సంయోగం వలన ప్రణవ నాద సప్త స్వరములై బరగ' అని వివరించారు. మంద్రస్థాయి గీతాలు గాయత్రి ఛందస్సులో, మధ్యస్థాయి గీతాలు త్రిష్టుప్ ఛందస్సులో, తారస్థాయి గీతాలు జగతి ఛందస్సులో పాడాలని పాణిని నిర్దేశించాడు.

లలితా సహస్ర నామావళిలో కూడా సంగీత ప్రసక్తి ఉంది. గ్రామ త్రయముల గురించి ఈ విధంగా చెప్పబడింది.

*మూలాధారైక నిలయా – బ్రహ్మ గ్రంథ విభేదిని*
*మణిపురాంతరుదితా – విష్ణు గ్రంథి విభేదిని*
*ఆజ్ఞాచక్రాంత రాళస్థా – రుద్ర గ్రంథి విభేదిని*
*సహస్రారాంబుజారూఢా – సుధాసారాభివర్షిణి..*

మూలాధారము నుండి బ్రహ్మ గ్రంథిని భేదించుకొని, మణిపూరకమునందు విష్ణుగ్రంథిని విభేదించి, ఆజ్ఞలో రుద్ర గ్రంధిని భేదించుకొని, సహస్రారమును అధిరోహించి సుధాసారమును వర్షించునని దీని భావము. ఇది సృష్టి క్రమమైన ఆహాత నాద తత్వాన్ని తెలియపరుస్తున్నది.

కేవలం సంస్కృత వాఙ్మయంలోనే గాక, ప్రాకృతంలో కూడా ప్రసక్తి కన్పిస్తున్నది. హాలుని గాథాసప్తశతిలో ఎన్నో తెలుగు పదాలు కన్పిస్తాయి. దానికి కారణం గాథాసప్తశతిలో కొంత భాగం తెలుగు గడ్డమీద నడిచిన గాథలే. అందులో అప్పటి జానపద జీవితము పరీవాహమై ప్రవహించింది. దీనివలన తెలుగు నేలమీద సామాన్య జనుల నాట్యసంగీతాసక్తికి రెండు వేల ఏళ్ళనాటి సాక్ష్యం సప్తశతి ద్వారా లభిస్తున్నది. కొన్ని ఉదాహరణలు గమనించండి.

పైరు నిండుగా ఉన్న తన పొలమును చూసుకుంటున్న రైతు ఆనందంలో తీస్తున్న కూనిరాగాలు వినండి.

*ణిప్పణ్ణ సస్సరద్ధీ సచ్ఛందం గాఇ పామరో సరఏ*
*దవి అణవ సాలీ తండుల ధవల మి అంకాసు రాఈసు*

దీని సంస్కృతానువాదం గమనించండి.

*నిష్పన్న సస్యబుద్ధిః స్వచ్ఛందం గాయతి పామరః శరధి*
*దలిత నవ శాలి తండుల ధవల మృగాంకాసు రాత్రిషు*

*– గాథాసప్తశతిలో తెలుగుపదాలు – తిరుమల రామచంద్ర.*

పురాణాల కాలం నాటికి సంగీతం సర్వతోముఖాభివృద్ధి చెందింది. బహుధా విస్తరింపబడింది. సంఘంలోని ప్రతివర్గం వారికి, అంటే సామాన్య జనులకు కూడా సంగీతం పట్ల ఆసక్తి పెంపొందింది. మనోల్లాసానికి సంగీతమొక వాహికగా మారింది. వాయుపురాణం సంగీతాన్ని గాంధర్వ విద్యగా అభివర్ణించింది.

ఇతిహాసాల కాలంలో సంగీత వికసనము సహస్రధా విస్తరించింది. సాంఘిక జీవనంలో సంగీతం ఎంతో ప్రాముఖ్యం సంతరించుకొంది. వర్ణవివక్షత సంగీతాభ్యాసానికి అడ్డంకి కాలేదు. అసలు రామాయణ కావ్యోద్భవమే నూతనమైన ప్రక్రియ. లౌకిక సాహిత్యంలో మొదటి శ్లోకం

*మానిషాద ప్రతిష్ఠాంత్వం*
*ఆగమ శ్శాశ్వతీ స్సమాః*



*యత్ క్రౌంచ మిథునాదేకం*
*అవధీః కామమోహితమ్*

అన్నది.

వాల్మీకి తన శ్లోకాన్ని "పాదబద్ధోక్షరసమః, తంత్రీలయ సమన్వితః" అని అన్నాడు. ఇందులో ప్రతిపాదంలో 8 అక్షరాలున్నాయి. మొత్తం 32 అక్షరాలు ఇవి. ఈ శ్లోకంలో అక్షర నియతి, పాదనియతి ఉన్నాయి. స్వరలయ సమన్వితమైన శ్లోకం పునాదిగా రామాయణ కావ్యాన్ని రచించి తన శిష్యులైన కుశలవులకు సంగీత బద్ధంగా చెప్పాడు వాల్మీకి. నిజానికి వాల్మీకి మహర్షిని ఆది వాగ్గేయకారుడనవచ్చు కదా! రామాయణమొక గీత కావ్యం.

యుద్ధరంగంలో కూడా వాయిద్యాల ప్రసక్తి ఉంది. యుద్ధకాండలో మొదటిసారిగా ఇంద్రజిత్తు యుద్ధానికి బయలుదేరినపుడు అతని వెంట **"భేరినిస్స్వన శంఖారావములు విస్వీథిందలంబార"** అంటూ రాక్షససేన నడిచిందని వర్ణించారు. ఎన్నో సందర్భాలలో సంగీత ప్రశంస రామాయణంలో కన్పిస్తుంది. ఏ ఉత్సవం జరిగినప్పటికీ అది సంగీతం నేపథ్యంగా ఉండేదని తెలుస్తుంది. ప్రజలలో వీరత్వాన్ని పెంపొందించడానికి గాని ఇతరత్రా మానసికోల్లాసికతకు గాని సంగీతం ఎంతో ప్రధానపాత్ర వహించిందని తెలుస్తున్నది. అసలు రామాయణమే ఒక గీత కావ్యము.

మహాభారతంలో కూడా సంగీతానికి సంబంధించిన ఎంతో విలువైన సమాచారం ఉన్నది. నృత్యశాలల ప్రసక్తి ఇందు కన్పిస్తుంది. ఎన్నో ఇళ్ళలో వీణారవళి విన్పించటం సామాన్యమైన విషయం. మోక్షప్రాప్తికి సంగీతమొక సోపానమన్న నమ్మకం ఆనాటి జనులలో ఉండేది. కృష్ణుడు, అర్జునుడు, భీష్ముడు మొదలైన ఎంతోమంది వీరులు శంఖాన్ని ఉపయోగించినట్లు తెలుస్తుంది. మహాభారతమునందు ముఖ్య పాత్రయైన శ్రీ కృష్ణుడు సర్వాంగీణమైన కళాకారుడు. సామగాన పద్ధతిలో గీతాబోధ జరిగినట్లు తెలుస్తున్నది.

వైదిక సాహిత్యంలోనే గాక బౌద్ధ జైన మతాల సాహిత్యాలలో కూడా సంగీత ప్రశంస కన్పిస్తున్నది. బుద్ధుని బోధనలను ఆయన శిష్యులు సంగీత సహకారంతో ప్రచారం చేసేవారట. ఆ కాలంలో సంగీత విద్వాంసుల మధ్య పోటీలు కూడా

జరిగేవని తెలుస్తున్నది. ఇంతేగాదు ప్రపంచమందలి సర్వభాషలలో అనువదింపబడి, ఎంతో ప్రఖ్యాతి చెందిన పంచతంత్రంలో ఎన్నో కథలలో సంగీత ప్రసక్తి కన్పిస్తున్నది. ఉదాహరణకు గాడిద–నక్క కథ.

ఈ విధంగా నేటి సంగీతం నాటి ప్రాక్తన మానవుని కూని రాగాల ద్వారా బహిర్గతమై క్రమంగా సంస్కరింపబడి వైదిక సంగీతపు విలువలను ఆపాదించుకొని మానవజీవితాన్ని మొత్తంగా అల్లుకొనిపోయింది. దీనియొక్క అభివృద్ధి, విస్తరణ ఎంతో గణనీయంగా సాగింది. ఇది ఒక జీవధార. దీనికి ఏ శక్తి కూడా అడ్డురాలేదు. కాలానుగుణమైన మార్పులను స్వీకరిస్తూ, తనదైన బాటలో సాగిపోతున్న ఈ సంగీత ధార అనేక శాస్త్రాలలో, కళల్లో తనదైన ఒక ప్రత్యేక స్థానాన్ని విలక్షణంగా నిల్పుకుంది. ఆనాదిగా వచ్చిన ఈ అనేకమైన మార్పులను క్రోడీకరించి, స్వానుభవమును కూడా జోడించి గ్రంథస్థము చేసినవాడు భరత మహర్షి. అందుకే నాట్య శాస్త్రము ఒక సమగ్రమైన గ్రంథము. నాట్యసంగీతాల అభివృద్ధి వికసనాల గురించి నాట్యశాస్త్రము తర్వాతనే లక్షణ గ్రంథాలు రావడం మొదలైంది. ఇటువంటి లక్షణ గ్రంథాల గురించి, సంగీతంతో కూడిన సాహిత్యరచన చేసిన వాగ్గేయకారుల గురించి తెలుసుకుందాం.



సంస్కృతి ఆంతరిక జీవనసరళి. నాగిరికత బాహ్య జీవనసరళి.



వర్ధమాన దేశాలలో విదేశీ మారక ద్రవ్యం తరిగిపోతే, ఆర్థిక వ్యవస్థ దెబ్బ తిన్న రీతిగా, మన నైతిక, ఆధ్యాత్మిక వనరులు తరగడం వల్ల, జాతీయ లక్ష్యాలైన సర్వజన శ్రేయోభ్యుదయములు దూరవుతున్నాయి.



సంస్కృతి ఆధారంగా ఏర్పడే సమైక్యత వల్ల దేశభక్తి పెంపొందడమే కాక ఆత్మగౌరవ హేతువవుతుంది.



# వాగ్గేయకారుల లక్షణాలు

చిన్మాత్రుడైన పరమాత్ముడు లోకసృష్టిని సంకల్పించిన క్షణములోనే కల్గింది శబ్దమయమైన ఆకాశం. ఆ తొలి శబ్దమే ప్రణవం. భగవంతుని ద్వారా కల్గిన ఈ శబ్దం భగవద్రూపమైనది. లయావిర్భావానికి ముందు ధ్యానినిమగ్నుడైన చతుర్ముఖుని హృదయములో ఆనందస్వరూపమైన పరబ్రహ్మ అఖండ నాద రూపంలో గోచరించింది. చతుర్ముఖుడు తన అసాధారణ యోగబలం చేత ఆ అఖండ నాదబ్రహ్మన్ని స్వీకరించినాడు. అది మూలాధారం నుండి నాభివరకు 'పరా' రూపంగాను, నాభి నుండి హృదయము వరకు 'పశ్యంతి' రూపంగాను, హృదయం నుండి కంఠం వరకు 'మధ్యమా' రూపంగాను, కంఠమూలం నుండి బయల్వెడలి నోటిద్వారా వెలుపలికి 'వైఖరీ' రూపంగాను రూపొందుతూ, ముందుగా కంఠమును 'అ', పెదవులందు 'ఉ', నాసికాగ్రంలో 'మ' కారమయమై మొత్తంగా ఏకాక్షర రూపముదాల్చి ప్రణవమయింది. దానివలననే స్వర వ్యంజన సముదాయాత్మకమైన అక్షరమాల ఏర్పడింది. వేదాలు ఉద్భవించినవి.

క్రమంగా ప్రణవ శబ్దం నుండి తక్కిన ప్రాణికోటి, మహత్సృష్టి ఏర్పడ్డాయి. భగవానుని ఉపాసించే అనేక మార్గాలలో నాదోపాసన ఒకటి. పరమాత్ముని అనంతశక్తి నాదమందు కూడా ఉంది అనటానికి నాదోపాసకులకు కలిగే అనుభవాలే సాక్ష్యాలు. మన శరీరం నుండి నాదం బయలుదేరేటప్పుడు శరీరంలో గల పలురకాలైన నాడులు కంపిస్తాయి. ఒక క్రమపద్ధతిలో ఆ కంపనం జరిగినట్లయితే ఒక దివ్యశక్తి ఉద్భవిస్తుంది. అదే నాదయోగం. నాదం అంటే వ్యాకరణశాస్త్ర రీత్యా మ్రోగునని, ధ్వనియని అర్థం. మంత్రశాస్త్రం 'న' అంటే ప్రాణమని, 'ద' అంటే అగ్ని అని, ప్రాణాగ్ని సంయోగరూపాన్ని నాదమని చెబుతున్నది. సారమతి రాగంలో 'ప్రాణానల సంయోగము వల్ల ప్రణవ నాదము సప్తస్వరములై బరగ' అంటూ త్యాగరాజస్వామి ఈ తత్వాన్నే వివరించారు.

చెవికింపు కల్గించు సుస్వరంతో సంప్రదాయబద్ధంగా తంబూర సహాయంతో తమ కంఠస్వరాన్ని శృతిచేసి నాదోపాసన చేసేవారికి భగవంతుడు తప్పకుండా సాక్షాత్కరిస్తాడు.

*నిద్దుర నిరాకరించి ముద్దుగా, దంబూర బట్టి*
*శుద్ధమైన మనసుచే సుస్వరముతో*
*బద్దు తప్పక భజియించే భక్తపాలనము సేయు*
*తద్దయా శాలివి నీవే త్యాగరాజనుత*

అని త్యాగరాజస్వామి తమ తోడి రాగమైన 'కద్దను వారికి' అనే కృతిలో ఇదే విషయాన్ని చెప్పారు.

సంగీత జ్ఞానంతో కూడిన భక్తి మోక్షానికి ఉత్తమ సాధనమని త్యాగరాజ స్వామి ఈ మాట అనేక కీర్తనలలో మాటిమాటికీ చెప్పారు. ఎన్నో జన్మాల నుండి సన్మార్గుడుగా ఉండి మోక్షం సంపాయించటం కష్టసాధ్యమని, అంతకన్నా సహజ భక్తితో రాగజ్ఞానసహితుడై ఉన్న వ్యక్తి తొందరగా ముక్తిని సంపాదించగలడని త్యాగరాజు భావన.

యోగులు, మంత్రద్రష్టలు సంగీత శాస్త్రాలని రూపొందించి ప్రపంచానికి అందచేశారు. ఆ శాస్త్రాలలోని విషయాలను తెలుసుకున్నప్పుడే జ్ఞానం, భక్తి ఏర్పడుతుంది. భృంగి, నటేశుడు, ఆంజనేయుడు, అగస్త్యుడు, మతంగఋషి, నారదుడు మొదలైన వారు ఈ సంగీత శాస్త్ర ప్రవర్తకులు. ఇట్టి పవిత్ర సంగీత శాస్త్రాన్ని భక్తితో ఉపాసించితే మోక్షం కల్గుతుంది. అయితే ఈ సంగీత జ్ఞానము కేవలం ఏదో ఉబుసుపోకకు నేర్చుకుంటే వచ్చేది కాదు. దైవానుగ్రహం వలన సిద్ధించాలి.

*సీతావర! సంగీతజ్ఞానము ధాత వ్రాయవలెరా! ।*
*గీతాద్యఖిలోప నిషత్సార భూత! జీవన్ముక్తుడౌటకు ॥*

అని త్యాగరాజు అంటారు. ఇటువంటి దైవానుగ్రహం గల వారే మన ప్రాచీన వాగ్గేయకారులందరూ. భగవద్దత్తమైన ఈ నాద యోగాన్ని తిరిగి భగవదర్పణం చేసిన ధన్యులు. "*కెరయ నీరద కెరిగె జల్లి వరవ పడెదవ రంతి కాణిరో*" – అని పురందర దాసు అంటారు. అంటే '*నీ ద్వారా వచ్చిన సంగీతం నీకే అంకితం*' అని భావం. తమ రచనల ద్వారా సంగీత కళను పరిపుష్టం చేసిన ఈ ధన్యులను వాగ్గేయకారులని సంఘం సన్మానించింది.



అసలు వాగ్గేయకార పదం యొక్క అర్థం ఏమిటి అని మొదట తెలుసుకోవాలి. మన పూర్వ లక్షణకారులు వాగ్గేయకారుడంటే ఏమిటో వివరించారు. సంగీత లక్షణ కారులలో మొదటిసారిగా వాగ్గేయకార లక్షణాలను లోకానికి పరిచయం చేసినవారు శార్ఙ్గ దేవుడు.

*వాఙ్మాతు రుచ్యతే గేయం ధాతు రిత్యభి ధీయతే*
*వాచం గేయం చ కురుతే యః స వాగ్గేయకారకః*

– సంగీత రత్నాకరం – ప్రకీర్ణికాధ్యాయం – శార్ఙ్గ దేవుడు.

అని తొలిసారిగా వాగ్గేయకార లక్షణాలను తెలియచెప్పాడు, సంగీత రత్నాకర కర్త. అంటే ధాతుమాతు నిర్మాణాలు రెండు సమర్థవంతంగా చేయగలవాడు వాగ్గేయకారుడనిపై శ్లోకార్థము.

సాహిత్యానికి ప్రాతిపదిక (Fundamental Unit) 'పదం'. దాని గుణము భావం. అట్లాగే సంగీతానికి ప్రాతిపదిక స్వరం – దాని గుణము నాదం. కనుక భావ ప్రధానమైన పదాన్ని (అనగా సుప్తిగతమైన దానిని మాటను – మాతువు) నాద ప్రధానమైన స్వరానికి (అనగా శరీరమందలి సప్తధాతువుల సాదృశ్యమున సప్తస్వరములకేర్పడిన సంజ్ఞగల ధాతువు) గూర్చి అనగా ధాతుమాతువులను కూర్చి గీతాన్ని రచించిగలిగినవాడే వాగ్గేయకారుడని సంగీతజ్ఞులు అభిప్రాయపడ్డారు.

వాగ్గేయకారునికి ఇంకా కొన్ని ముఖ్య లక్షణాలు ఉన్నాయి.

*శబ్దాను శాసన జ్ఞాన మభిదాన ప్రవీణతా*
*చన్దః ప్రభేద వేదిత్వ మలంకారేషు కౌశలమ్*

– సంగీత రత్నాకరం – ప్రకీర్ణికాధ్యాయం – శార్ఙ్గ దేవుడు.

శబ్దానుశాసన జ్ఞానం, అమరకోశాది నైఘంటిక పరిజ్ఞానం, అలంకార కౌశలం కల్గి ఉండాలని దీని అర్థం.

రసభావ పరిజ్ఞానః దేశస్థితిషు చాతురీ
అశేష భాషా విజ్ఞానం కలాశాస్త్రేషు కౌశలమ్

– సంగీత రత్నాకరం – ప్రకీర్ణకాధ్యాయం – శార్ఙ్గ దేవుడు.

రసభావాల పరిజ్ఞానం, లోకజ్ఞత, అశేష భాషా జ్ఞానం, సకల కళలందు, శాస్త్రాలందు నేర్పు కల్గి ఉండాలని దీని భావము.

తూర్య త్రితయ చాతుర్యం హృద్య శారీర శాలితా
లయ తాళ కలాజ్ఞానం వివేకోనేక కాకుషు

– సంగీత రత్నాకరం – ప్రకీర్ణకాధ్యాయం – శార్ఙ్గ దేవుడు.

నృత్య, గీత, వాద్యాలందు నేర్పు, గాత్రం మాధుర్యంగా ఉండటం, లయ, తాళం, కళాజ్ఞానం, కాకువుల వివేచన అంటే 'గాన పద్ధతిలో వివిధ యాసల నెరిగి ఉండాల'ని దీని అర్థము.

శబ్ద రూపమైన సాహిత్యాన్ని, స్వర రూపమైన వర్ణమెట్టునందు, పరిణత జ్ఞానాన్ని పొంది పొందికగా రెండింటిని సమన్వయ పరచి సహృదయ మనోరంజకంగా రచనలు చేసేవారు వాగ్గేయకారులని అర్థం. అయితే కేవల ధాతుమాతు కూడికతో ఏర్పడిన గీతం సంపూర్ణమైనది కాదు. మనోహర భావ సంపన్నతతో, ప్రసన్నమైన పద సమపస్థానంపెదాయంతో కూడిన సాహిత్యం సంగీతంతో సమ్మిళితమైనపుడు, అది ఆపాతమధురమై, అలౌకిక భావ పరంపరలను కల్గిస్తుంది. ఈ అనుభవం ఉత్తమ వాగ్గేయకారుల రచనలలో కన్పిస్తుంది.

స్వరసంచారం, మూర్ఛనలు, సంగతులు, గమకాలు మొదలైనవి సమకూడినపుడే ఆ కీర్తన శృతిసుభగంగా ఉంటుంది. ఆ కీర్తన శ్రోతల నలరింపచేస్తుంది. గాయకునకు, శ్రోతకు ఉత్తమ గతులను కల్పిస్తుంది. ఇట్టి స్థితి సంగీత సాహిత్యాలలో సమాన ప్రతిభావ్యుత్పత్తులు గల వారికే సాధ్యమవుతుంది.

సుశబ్ద–అపశబ్దాల వివేకం, నిర్దుష్ట పద ప్రయోగవిజ్ఞానం వాగ్గేయకారుల లక్షణాలలో ముఖ్యమైనది. అయితే ఇదొక్కటే గాదు, భూత భవిష్యద్వర్తమానాల పరిశీలనా శక్తి, దేశకాల పరిజ్ఞానం, వాక్పటుత్వం కూడా చాలా అవసరం. ఎందుకంటే వాగ్గేయకారులు లోకంపట్ల నిరాసక్తులు కాదు. సంఘంలో జరిగే దురాచారాలను, మూఢాచారాలను ఖండించే సంస్కారులు. సంఘంలోని మంచిని హర్షించి, చెడును నిరసించే ధైర్యం కలవారు. అయితే రోషద్వేషముల కతీతంగా సౌహార్ద్రాన్ని కల్గి ఉండటం కూడా వీరి ముఖ్య లక్షణాలలో ఒకటి. సాహిత్యానికి సంబంధించినంత వరకు భావానికి తగిన వాక్యనిర్మాణ శక్తి వీరికి అవసరం.

ప్రబంధాలయందు అంటే సంగీత శాస్త్రంలో ప్రసిద్ధమై యున్న ప్రబంధ రీతులందు ప్రగల్భతను చాటగలగాలి. నానార్థ ప్రయోగదక్షత కల్గియుండాలి. శాస్త్రోక్తములైన ఆలాపనా రీతులు తెలిసి ఉండాలి. దీనివలన రాగభావము స్పష్టమవుతుంది. వీటన్నింటిని మించి వాగ్గేయకారుడు ద్వంద్వాతీతుడు, ఏకాగ్రమనస్కుడు, తత్వజ్ఞుడు, లోకానుభవశాలి, కవిబ్రహ్మ అయి ఉండాలి. అతి క్లిష్టమైన తత్వాలను కూడా అల్ప పలుకుబడులతో సూటిగా మనస్సుకు హత్తుకునేట్లు చెప్పగల శక్తి సామర్థ్యాలు కల్గి ఉండాలి. ఈ విధంగా బహుముఖ ప్రజ్ఞాశాలి అయితే తప్ప ఒక వ్యక్తిని వాగ్గేయకారుడని అనలేము. సాధారణంగా వాగ్గేయకారులు జనసామాన్యానికి అందుబాటులో ఉన్న సులభమైన భాషనే ఉపయోగించారు.

ఇటువంటి వాగ్గేయకారుల రచనలు ఉపాసకునకు, శ్రోతకును జీవన్ముక్తిని కల్గిస్తాయి. భావుకులైన వాగ్గేయకారులు భగవద్భక్తి తత్పరులై తమ జ్ఞానభక్తి వైరాగ్యాలను గేయాల ద్వారా తామనుభవించి, సామాన్య ప్రజానీకానికి మోక్షమార్గాన్ని చూపించారు. శంకర భగవత్పాదుల వారు 'భజ గోవిందం' అనే గేయం ద్వారా భక్తి ప్రబోధం చేసి వాగ్గేయకార పరంపరను ప్రకాశింపచేసారు. సంగీత లక్షణకారులు గేయరచనకు అనుమతించిన పద్ధతిలో, మాత్రా ఛందస్సులో గడిచిన గేయమాలిక ఇది. ఇటువంటి ఛందోరచన గానానుకూలమైంది. సంస్కృత సాహిత్యంలో శంకరాచార్యుల వారు ఉత్తమ వాగ్గేయకారుడని అనవచ్చును.



# సంస్కృతం

**భా**రతీయ అపూర్వ దార్శనికతకు వేదాలు చక్కని ఉదాహరణలు. జీవన వేదాన్ని కవితాత్మకంగా వెలయించిన రచనలవి. ప్రాచీన నాగరిక సమాజపు సంగీత సాహిత్యాలు తెలుసుకోవాలంటే, నాగరికపు విలువను అర్థం చేసుకోవాలంటే సంస్కృత వాఙ్మయం, ముఖ్యంగా వేదాలు చదువవలసిందే. ఈ సాహిత్యమంతా సర్వాంగ సుందరమైనది. అంబరాన్ని చుంబించే రసగంగా ప్రవాహంతో భూతలాన్ని పునీతం చేసిన సాహితీ ధార అది. ఆ సాహితీ ధారలో మృదుమధురంగా వినిపించే జల తరంగిణుల సంగీతం మనలనొక రసప్రపంచానికి తీసికొనిపోతుంది. ఈ అమరవాణిలో తమ బాణీలను సహజ సుందరంగా పలికించారు నాటి విదుషీమణులు.

ఏ విషయాన్ని ప్రారంభించాలన్నా మనం సహజంగా వేదాలలో దాని మూలం వెతుకుతాము. అదేవిధంగా స్త్రీ వాగ్గేయకారులు అన్న భావనకు మూలం వేదాలలో దొరకవచ్చునన్న విశ్వాసం మొదటగా వేదాలు ముఖ్యంగా ఋగ్వేదం తరచి చూసేలా చేసింది. మొదట సంతోషం, దానివెంట ఒకానొక గర్వం కలిగేవిధంగా ఎందరో స్త్రీలు ఋగ్వేద మంత్రద్రష్టలుగా కనిపించారు. వీరిని ఆ కాలంలో 'ఋషిక' లన్నారు. సాహిత్య విలువలు కలిగి ఉన్న ఈ ఋక్కులు ఛందోభరితమైనవి. గానానుకూలమైనవి.

చరిత్రకందినంత వరకు లిఖిత పూర్వకమైన సంస్కృత వాఙ్మయం మనకు క్రీస్తు పూర్వం 3వ శతాబ్దంలో లభిస్తున్నది. అంతకుముందు మౌఖికంగా ప్రచారంలో ఉన్న వేదాలుగాని, ఉపనిషత్తులు గాని ఏ కాలం నుండి ప్రచారంలో ఉన్నాయో ఇదమిత్థంగా చెప్పలేము. నాల్గు వేదాలు సమకాలీనాలు కాదని అందరికీ తెలిసిన విషయమే. అయితే అతి ప్రాచీనమైన ఋగ్వేదం, అందులోని భాష గమనిస్తే మానవసమాజపు తొలి నాగరికతా దినాలలో ఋక్కుల ఆవిర్భావం జరిగినట్లు అన్పిస్తుంది. భాషలో, భావంలో పెరిగిన సంస్కారం, నాగరికత తర్వాతి వేదాలలో కన్పిస్తుంది. నాల్గు వేదాలు, వాటి సంహితలు, తర్వాత వచ్చిన బ్రాహ్మణకాలు, అరణ్యకాలు, ఉపనిషత్తులు, వేదాంగాలు – ఈ రకంగా విస్తరించిన సంస్కృత సాహిత్య చరిత్రలో చరిత్ర సృష్టించిన విదుషీమణులెందరో కన్పిస్తున్నారు. ప్రతిభకు స్త్రీ పురుష భేదం లేదని నిరూపించిన ఋగ్వేదం నాటి ఋషికల గురించి, వారిచే రచింపబడిన ఋక్కుల గురించి మొదటగా తెలుసుకుందాం.

స్వయంగా స్త్రీలే ఎన్నోచోట్ల మంత్రద్రష్టలుగా కన్పిస్తున్నారు కాబట్టి ఈ కాలంలో స్త్రీల సామాజిక స్థితిగతులు, మానసిక పరిణతి ఉదాత్తంగా ఉన్నాయని అనుకోవచ్చును. కేవలం సాహితీపరంగా మాత్రమే గాక "అబలా అస్యసేనాః" (5-30-9) అన్న వాక్యమాధారంగా వీరు యుద్ధాలలో కూడా పాల్గొన్నట్లు తెలుస్తున్నది. అయితే ప్రస్తుత విషయం మంత్రద్రష్టలైన స్త్రీలు, వీళ్ళను 'ఋషిక'లని వ్యవహరించేవారు. ఋగ్వేద ఋషులు దాదాపు 2 వేలకుపైగా ఉండగా అందులో పాతిక మంది స్త్రీలు బ్రహ్మవాదినులుగా కన్పిస్తున్నారు. బ్రహ్మవాదినులు అంటే వేదం అధ్యయనం చేసి బ్రహ్మతత్వజ్ఞానం కల్గినవారు అని అర్థం. దీనినిబట్టి దాదాపు 5 వేల సంవత్సరాల క్రితమే విద్య అందరికీ అందుబాటులో ఉండేదని అవగతమవుతుంది.

విజ్ఞాన సముపార్జనలో తరతమ భేదాలు లేవని అర్థమవుతుంది. ఈ కాలంలో స్త్రీలు విద్యావంతులవటమే కాకుండా, విద్యావంతులైన పురుషుడినే వివాహమాడేవారు. బాలికలకు ఉపనయన కర్మ జరిగేది. సావిత్రివచన విద్యార్థులయ్యే అవకాశం బాలికలకు ఉండేది. సావిత్రి వచన విద్య అంటే విద్యాభ్యాసంలో పైమెట్టు. ఉపనిషత్తుల రచనలలో కూడా మహిళలు కన్పిస్తున్నారు. విద్యాభ్యాసం కోసం మహిళలు కూడా దూరప్రాంతానికి వెళ్ళిన ఋజువులున్నాయి. **"పత్యస్వస్తి"** అన్న స్త్రీ ఉత్తర దిశగా పయనించి హిమాలయ ప్రాంతాలలోని ఋషివాటికలో తనకు నచ్చిన విద్య నేర్చుకుని వచ్చిన కథ మనకు సంస్కృత సాహిత్యంలో కనిపిస్తుంది. ప్రఖ్యాత బ్రహ్మవాదిని అయిన గార్గి జనకుని చేత పండిత సభకు ఆహ్వానింపబడిన విషయం మనకు తెలుసుకదా!

కొంతమంది బ్రహ్మవాదినుల పేర్లు ఉదాహరిస్తాను. రోమశ, లోపాముద్ర, అదితి, అపాల, ఘోష, దక్షిణ, సరమ, శశ్వతి, విశ్వవార, జుహుదేవి, ఇషాంమాత,

గోధ, శ్రద్ధ, శిఖండిని, శచి, యమి, ఇంద్రాణి, ఊర్వశి, మతంజలి, సూర్య, వసూకర పత్ని.

ఇక్కడ ఒక విషయం చెప్పటం సముచితమని భావిస్తున్నాను. ధర్మశాస్త్రాలలో హరీత మహాముని రచించిన హరీత ధర్మసూత్రాలకి ఒక విలక్షణత ఉంది. ఇది 30 అధ్యాయాలు గల గ్రంథం. ఈ మహర్షి స్త్రీలకు గల వేదాధ్యయన, ఉపనయన అర్హతల గురించి చర్చించాడు. ఇదొక్కటే గాదు, వాసిష్ఠ ధర్మసూత్రాలలో నియోగి పద్ధతిని, వితంతు వివాహాన్ని సమర్థించడం గమనార్హం.

పాణిని మహర్షి స్త్రీ విద్యను సమర్థించాడు. శ్రౌత సూత్రాలు, గుహ్య సూత్రాలు యజ్ఞాలలో భర్తతోపాటు భార్య ఉచ్చరించవలసిన మంత్రాల గురించి వివరంగా తెల్పాయి. పూర్వ మీమాంస మత విషయాలలో స్త్రీల ప్రాధాన్యాన్ని ఎత్తిచూపింది. ఏ విషయంలో కూడా స్త్రీ పురుషుల మధ్య అంతరాలు లేని సువర్ణ కాలమది. పతంజలి మహాభాష్యంలో విదుషీమణులైన మహిళల ప్రస్తావన కన్పిస్తుంది. కౌటిల్యుడు తన అర్థశాస్త్రంలో మహిళల విద్యాభ్యాసంతో పాటు శారీరిక దారుఢ్యానికి కూడా సమానమైన స్థానాన్ని కల్గించాడు.

గతంలో ఋగ్వేద ఋక్కులు సాహిత్య సంగీత సమ్మేళనాలని సోదాహరణ పూర్వకంగా నేను నా పరిశోధనా గ్రంథంలో నిరూపించాను. శబ్దం లేని అర్థం, అర్థం రాని శబ్దం అసమగ్రమైనవి. అర్ధనారీశ్వర తత్వాన్ని ఈ విధంగా భావించాడు కాళిదాసు –"వాగర్థా వివ సంపృక్తౌ" అన్న శ్లోకంలో. ఈ అభిప్రాయాన్ని సంగీత సాహిత్యాలకు కూడా అన్వయించవచ్చును. సంగీత సహాయం లేని సాహిత్యం, సాహిత్యావలంబన లేని సంగీతం అసమగ్రమైనది. ఈ భావన మనకు వేదాలనుండే కన్పిస్తుంది. మొదట మంత్ర రచన జరిగి ఆ తర్వాత సంగీతపు కూర్పు ఏర్పరచటం జరగలేదు. ఈ రెండు సమాంతరంగా జరిగాయి. ఈ ఉదాహరణ గమనించండి.

*అగ్నిమీ + ళేపురోహి + తం*
*తకిట తకిట + తకిట తకిట + తక*
*యజ్ఞస్య + దేవం + ఋత్విజం*
*తకిట తకిట + తకిట తకిట + తకిట తకిట*
*హోతారం + రత్నధాత + మం*
*తకిట తకిట + తకిట తకిట + తక*

పై శ్లోకంలో 'అగ్నిమీ' తర్వాత ఒక మాత్రాకాలం సాగదీయాలి. అప్పుడు తిస్రగతి వస్తుంది. అట్లాగే 'యజ్ఞ' తర్వాత రెండు మాత్ర కాలం, 'దేవం' అనే పదంలో 'దే' తర్వాత ఒక మాత్రాకాలం, 'వం' తర్వాత ఒక మాత్రాకాలం, 'ఋత్విజం' తర్వాత ఒక మాత్రాకాలం స్వరయుక్తంగా సాగదీసి చదివితే స్వర సాహిత్యాల సమ్మేళనం చక్కగా అర్థమవుతుంది. (ఈ వివరణ ఇచ్చినవారు డా॥సి.నారాయణరెడ్డి, తెలుగు కవిత–లయాత్మకత అన్న గ్రంథంలో). ఆనాడు మొదలైన ఆ స్వరయుక్త సాహితీ ధార నేటికి కూడా కొనసాగుతూనే ఉంది.

ఋక్కులలో సంగీత సాహిత్యపు విలువలు కన్పిస్తాయి. అందులో కొన్ని ఋక్కులను వాటి విశేషాలను ఇక్కడ ప్రస్తావిస్తున్నాను.

1) ఘోష : ఈమె కక్షవానుడనే ఋషి కుమార్తె. అశ్వినీ కుమారులను ప్రస్తుతిస్తూ ఈమె ఋక్కులను పలికింది. ఈ సూక్తాలలో ప్రాణికోటికి అశ్వినులు చేసిన హితకరమైన కార్యాలను పొగడింది.

*ఓం యోవాం పరిజ్మాసు వృదశ్వినారథో*
*దోషా ముషా సో హవ్యో హవిష్మతా ।*
*శ శ్వత్తమా సప్త మువా మిదం వయం*
*పితుర్న నామ సువాహం హవామహే ॥* (10–39–1)

2) వాక్ : ఈమె అంభృణ ఋషి పుత్రిక. ఈమె రచించిన సూక్తాలలో వాగ్దేవి మహిమ వర్ణింపబడింది.

*ఓం అహం రుద్రాయ ధనురాతనోమి*
*బ్రహ్మద్విషే శరవే హంతనా ఉ ।*
*అహం జనాయ సమదం కృణోమ్యహం*
*ద్యావా పృథివీ అవివేశః ॥* (10–25–1)

3) సార్పరాజ్ఞి : ఈమెచే రచింపబడిన ఈ మంత్రంలో సమస్త ప్రపంచం సుఖమయ జీవనం గడపాలన్న ఉదాత్త భావాలు కన్పడుతున్నాయి.

ఓం మయో భూర్వాతో అభివాతూప్రా
ఉర్జస్వతీ రోష ధీరారి శం తాం ।
పీవ స్వతీర్జీ వధవ్యాః పిబం త్వవసాయ
పద్యతే రుద్ర మృళ ॥ (10-169-1)

4) సూర్య : ఈమె సూక్తాలు సాధారణంగా వివాహ సమయంలో పఠించటం నేటికీ ఒక ఆనవాయితీగా వస్తున్నది.

ఓం సమ్రాజ్ఞీ శ్వశురేభవ సమ్రాజ్ఞీ శ్వశ్రాం భవ ।
ననాందరి సమ్రాజ్ఞీ భవ సామ్రాజ్ఞీ అధి దేవృషు ॥ (10-85-46)

ఋగ్వేదంలోని ఈ మంత్రాలు ఆనాటి సామాజిక జీవనాన్ని తెలియపరిచేవిగా ఉన్నాయి. అంతేగాదు సంఘం సుఖ శాంతులలో విలసిల్లాలని ఆకాంక్షించిన ఋషికల ఉదాత్తత అర్థం అవుతుంది. పైన పేర్కొన్న మంత్రాలలో గాంభీర్యం కనిపిస్తే కవితాత్మతో కూడిన సూక్తాలు కన్పిస్తున్నాయి కొన్నిచోట్ల. ఉదాహరణకు విశ్వామిత్ర నదీ సంవాదం గమనించండి. ఇందులో నదీమతల్లి లోక కళ్యాణం కోసం, విశ్వామిత్రుని ప్రార్థన మేరకు ఏవిధంగా తన తీవ్ర ప్రవాహ గతిని తగ్గించుకున్నదో తెలుస్తుంది.

ఓం ఇంద్రో అస్మాం అరద ద్వజ్ర బాహు
రపాహన్వృత్రం పరిధిం నదీనామ్ ।
దేవో నయ త్సవితా సుపాణి
స్తస్య వయం ప్రసవే యామ ఉర్వీః ॥
ఓం ఆతేకారో శృణవా మావబాంసి
య యాధ దురాదన సారథేన
ని తే నంసై పీప్యానేవ యోషా
మర్యా యేవ కన్యా శశ్వచై తౌ ॥

వజ్రబాహువైన ఇంద్రుడు మేఘములను భేదించి ఉదకములను కురిపించి మమ్ముల పూరించి, మా ద్వారా సముద్రమును నింపినాడు. ఆతని ఆజ్ఞతో సంపూర్ణ ప్రవాహములు కలవారమై ప్రవహింతుము. ఓ విశ్వామిత్రా! శకటమారోహించి దూరము నుండి వచ్చినావు. లోక కళ్యాణార్థం మేము నీకై ప్రవాహమును తగ్గించుకొనుచున్నాము అని పైదాని భావం.

భారత కులజులు నిండుగా గంభీరంగా ప్రవహిస్తున్న నదిని దాటవలసిన సన్నివేశమది. లోక కళ్యాణార్థం తనను దాటదలచిన వారి కొరకు తనని తాను కుంచించుకున్న త్యాగమయి ఈ నదీమతల్లి. అందుకే విశ్వామిత్రుని చేత మంగళకరములైన ఆశీర్వచనాలని పొందగల్గింది.

ఇదేవిధంగా పణి సరమా వివాదం కూడా ఎంతో రసభరితమైనది. ఈ సూక్తాలు సరమ సత్యశోధనకు, నిర్భయతకు, పట్టుదలకు ఉదాహరణలుగా నిలుస్తాయి.

ఓం ఇంద్రస్య దూతి రిషితా చరామి
మహా ఇచ్ఛన్తీ పణయో నిధీన్వః ।
అతిష్కదో భియసాతన్న ఆవత్తథా
రసాయా ఆతరం పయాంసి ॥
ఓం అసేన్యావః పణయో వచాంస్య
నిష న్యాస్తన్వః సన్తు పాపీ ।
అధృష్టో న ఏతవా అస్తు బృహస్పతిర్వ
ఉభయాన మృళాతే ॥

ఓ పణులారా! ఇంద్ర కార్యం ఉదాత్తమైనది. ఆ కార్యం మీద ఆయన దూతిగా వచ్చిన నన్ను నది కాపాడింది. అంటే నిర్భయతకు జయం కలుగుతుంది. మీరు వీరులవలె ప్రవర్తించుట లేదు. మీరు ఇంద్రబాణాగ్నికి ఆహుతైపోగలరు. ఇటువంటి దుడుకు త్రోవ మీకు తగదు. బృహస్పతి మిమ్ములను శిక్షించగలడు అని భావం.

ఋగ్వేదం సరమను ఋజుత్వానికి, సత్యానికి తార్కాణంగా చూపించింది. ఈమె ఇంద్రుని దూతగ ఇక్కడ చిత్రీకరింపబడింది. ఈ సన్నివేశంలో సరమ పలుకులు ఉదాత్తమైనవి. జ్ఞానమయ జ్యోతికి గోవులనిక్కడ ప్రతీకలుగా చూపుతున్నది ఋగ్వేదం. అవి లోక కంటకులైన వారి చేతిలో చిక్కాయి. ఇంద్రుని ఆజ్ఞ మేరకు సరమ ఈ

గురుతర బాధ్యతను తన మీద వేసుకుంది. సఫలీకృతురాలైంది. ఇదే పణి సరమల సంవాదం.

పైన ఉదాహరించిన సూక్తాలన్నీ ఉదాత్త అనుదాత్త స్వరాల ఆధారంగా చదివినట్లయితే వాటిలోని సంగీతపు వైశిష్ట్యం తెలుస్తుంది. ప్రతి సూక్తంలోని అంతర్గత లయ మనలను ఆహ్లాద పరుస్తుంది. ఈ రకమైన రచనలు అంటే సంగీత సాహిత్య సమ్మిళితమైన రచనలు నాటి ఋషికలను భారతదేశంలోనే తొలి వాగ్గేయకారిణులుగా నిలబెట్టాయి. స్థానికంగా లేదా ప్రాంతీయమైన భాషలు అభివృద్ధి చెందిన తర్వాత ఈ సంగీత సాహిత్య ధార ఎంతోమంది విదుషీమణుల రచనలలో స్పష్టంగా కన్పించింది. నాటి ఋషికలకు వీరు నిజమైన వారసులన్పించుకున్నారు.

ఈ రకంగా అతి ప్రాచీన కాలంలో స్త్రీలు సంగీత సాహిత్యపు విలువలతో ఉన్న కవిత్వం సంస్కృతంలో చెప్పారు. ఆ తర్వాతి కాలంలో ఏర్పడిన అనేక ప్రతికూల పరిస్థితులకు తల ఒగ్గిన కారణంగా స్త్రీల రచనలు మనకు కన్పించలేదు. అంతేగాదు, విద్యావంతులైన స్త్రీలు కూడా చాలా తక్కువ. సాంఘికమైన బరువు బాధ్యతలు వారిని కుటుంబ పరిధిని దాటనీయలేదు. అందుకే వారి మానసిక వికాసానికి అవరోధం ఏర్పడింది. కాని ఈ ప్రతికూల పరిస్థితులను కొందరు స్త్రీలు ఎదిరించి, సాహిత్య స్పృహతో రచనలు చేసి విదుషీమణులనిపించుకున్నారు. కళావిష్కరణకు స్త్రీ పురుష భేదం ఉండదన్న విషయాన్ని ఈ విదుషీమణులు ఋజువు చేశారు. అటువంటి ఉత్తమ కవయిత్రుల గురించి తెలుసుకుందాం.





# తెలుగు

చరిత్రకందని కాలం నుండి తెలుగు ప్రజలు, తెలుగు భాష ఉన్నప్పటికీ అధికారికంగా ఆధార సహితంగా మనం చెప్పుకోవలసింది 11వ శతాబ్దం నుండి మాత్రమే. లభించిన తొలి గ్రంథం సర్వలక్షణ సమన్వితమైన ఆంధ్రమహాభారతం. హఠాత్తుగా ఒక భాష అత్యున్నత స్థాయికి ఎదగడం అసాధ్యం. కాబట్టి 11వ శతాబ్దం కంటే పూర్వమే తెలుగు భాష జనం వ్యవహారంలోనూ, సాహిత్య పరంగానూ కూడా ఉన్నది, కాని వెలుగు చూడలేదని మాత్రం చెప్పవచ్చును. నన్నయ్య కాలం నుండి సాహిత్య చరిత్రను గమనిస్తే కవుల పరంపరలో దాదాపుగా 400 సంవత్సరాల వరకు స్త్రీల రచనలు కన్పించడం లేదు.

సంస్కృతంలో, తెలుగులో సమానంగా కవిత్వం చెప్పిన తెలుగు కవయిత్రులు ఉన్నారు. గంగాదేవి, తిరుమలాంబ, మధుర వాణి వంటి కవయిత్రులు సంస్కృత కవిత చెప్పిన తెలుగు స్త్రీలు కాగా కేవలం తెలుగులోనే చిక్కని కవిత్వం చెప్పిన తెలుగు విదుషీమణులు ఉన్నారు. అటువంటి వారి గురించి ఇక్కడ ముచ్చటించు కుందాము. తొలిసారిగా 12వ శతాబ్దంలో గోన బుద్ధారెడ్డి కుమార్తె కుప్పాంబిక కవయిత్రిగా వెలుగులోకి వచ్చింది. అప్పటి నుండి దాదాపు 200 సంవత్సరాల కాలం పాటు స్త్రీలు సాహిత్య రంగంలో తమదైన స్థానాన్ని నిల్పుకున్నారు. వారి సంగీత సాహిత్య సేవ చూద్దాం.

## కుప్పాంబిక

తొలి తెలుగు కవయిత్రి కుప్పాంబిక. ఈమె తొలి తెలుగు రామాయణ కర్త అయిన గోన బుద్ధారెడ్డి కుమార్తె. కుప్పాంబిక భర్త మల్యాల గుండనాథుడు. ఈమె వేయించిన ఒక శాసనం ఈ మధ్యనే వెలుగు చూసింది. ఇది సామాన్య శకం

1276లో వేయించిన శాసనం. అందులోని భాషను గమనించినట్లయితే కుప్పాంబిక చక్కని సాహిత్యాభిలాషి అని తెలుస్తుంది. కానీ ఈమె రచించిన ఒక్క గ్రంథం కూడా లభించలేదు. అయితే తర్వాతి కాలంలో అయ్యలరాజు తన సంకలన గ్రంథంలో కుప్పాంబిక పద్యాన్ని ఉదాహరించాడు. భావం, భాష చిక్కగా ఉన్న ఈ పద్యం చూడండి.

*నవజాతాంబకుడేయు సాయకములన్ వర్ణింపగా రాదు, నూ*
*తన బాల్యాధిక వనంబ మదికిన్ ధైర్యంబు రానీయ ద*
*త్యను రక్తిన్ మిము బోంట్లకున్ దెలువ నాహా! సిగ్గుమైకోదు, పా*
*వన వంశంబు స్వతంత్రమీయదు, చెలీ! వాంఛల్ తుదలముట్టునే*

'నవ యౌవనం ఎవరిని వదిలి పెట్టదు. వాంఛ అనేది సహజం. సిగ్గు కూడా సహజమే. కానీ పావన వంశంలో పుట్టిన వారికి ముఖ్యంగా మహిళలకి అదనంగా ఉన్న ఆటంకం ఒకటి ఉంది. స్వేచ్ఛగా ఏదీ బయటకు చెప్పుకోలేని అస్వతంత్రత' అని భావం.

అయితే మొత్తం గ్రంథం దొరకని కారణంగా కుప్పాంబిక వైదుష్యం గాని, నా పరిశోధనలో నేను గమనిస్తున్న సంగీత ఛాయలు కానీ ఇక్కడ లభించలేదు.

## తిమ్మక్క

తిమ్మక్క సహజంగా సంగీత సాహిత్యాలలో నిపుణురాలు. కాబట్టి తన రచనయైన సుభద్రా కళ్యాణం చక్కటి లయతో కొనసాగించి చిన్నతనంలో పుట్టినింటిలో సంగీత సాహిత్యాల నిరంతర గోష్ఠి తిమ్మక్క ఆయా విషయాల పట్ల ఆసక్తిని పెంచింది. తర్వాతి కాలంలో భర్తయైన తాళ్ళపాక అన్నమాచార్యుల వారి సాహచర్యంలో అందులో పరిణతిని సాధించింది. అందుకే సుభద్రా కళ్యాణంలో ఆ పరిణతి అడుగడుగునా కన్పిస్తుంది. తిమ్మక్క సంగీత సాహిత్య పరిజ్ఞానానికి ఈ రచన చక్కని ఉదాహరణ. ఈమె సాహితీ జగత్తును తన కుసుమ కోమల కవితతో ఉర్రూతలూగించింది. సాహిత్య పరంగా సంగీత పరంగా ఎన్నదగిన ఈ వర్ణన చూడండి–

*యెగు భుజమ్ముల వాడు – మృగరాజు నడుము*
*నడచి పుచ్చుకొనునె – న్నడుము గలవాడు*
*గరగరని వాడు చ – క్కని వాడు నతడు*
*గొప్ప కన్నుల వాడు – కోదండ గుణకి*
*ణాంకంబు లే బాహు – లమరిన వాడు*
*వెన్నున మచ్చగల – విభవంబు వాడు*
*బవిరి గడ్డము వాడు – పన్నిదం బిడిన*
*వెన్ను పగడ సాల – వెస నాడవచ్చు*
*చిగురొత్తు చెంద్రిక – చెలగు పాదములు...*

చక్కటి లయతో కొనసాగుతుందీ గేయం.
ఇటువంటిదే ఇంకొక వర్ణన.

*జోకతో కమ్మ క – స్తూరి నలుగిడెను*
*జాతి గొజ్జగి నీట – జలకమ్ములాడి*
*రీతిగా నొక వింత – రేఖ చూపట్టి*
*ఉమ్మెత్త పువ్వు వలె – నుతికిన మడత*
*నఖముల గొని తెచ్చి – నాతి యిచ్చినను*
*చెంగావి పావడ – రంగు మీఅంగ*
*చుండ విడిచి కట్టె – సుదతి సుభద్ర*
*పచ్చి పోకల తోడ – పండుటాకులతో*
*గమ్మన కపుర వీ – డెమ్ము గావించె*
*ఆ రామ చిలుక భు – జాంగదమ్మునను*
*రాజసమ్మున నునిచె – రమణి సుభద్ర...*

ఈ విధంగా సాగిపోయే వర్ణనలో సుభద్ర సౌందర్యము కళ్ళ ముందు కదలాడటమే గాక, రామచిలుకను భుజం మీద ఉంచి వొయ్యారంగా నడుస్తున్న సుభద్ర కాలి అందెల సవ్వడి వినిపిస్తుంది. ఈ గేయంలో ఇంతటి లయను సాధించగల్గింది తిమ్మక్క.

## మొల్ల

రామకథ పైని మక్కువతో, భక్తితో తెలుగు కవులెందరో రామాయణాన్ని కావ్యంగా మలిచారు. అందులో ఆతుకూరి మొల్ల విశిష్ట స్థానాన్ని ఆక్రమిస్తుంది. తానేమీ చదువుకోలేదని, శ్రీ కంఠ మల్లేశ్వరుని వరం చేతనే కవిత్వం చెప్పగలిగానని ఎంతో వినయంగా చెప్పుకుంది మొల్ల. కాని మొల్ల రామాయణం చదివితే ఆమె పాండిత్యపు లోతు, గాంభీర్యం, కవిత్వపు సున్నితత్వం అర్థమవుతాయి. కొన్ని వందల రామాయణాలు రచింపబడిన నేపథ్యంలో మొల్ల రామాయణం నేటికీ నిలిచి ఉండటమే ఆ కావ్యానికి గల విశిష్టత. సుకవిత్వం ఎట్లా ఉండాలో చాలా స్పష్టంగా తన కావ్యంలో చెప్పిందామె.

*తేనె సోక నోరు తీయనయగు రీతి*
*తోడ నర్థమెల్ల తోచకుండ*
*గూఢ శబ్దములను గూర్చిన కావ్యమ్ము*
*మూగ చెవిటి వారి ముచ్చటగును*

అని అంటూనే కవి పండిత విమర్శక లోకానికి తన అంతరంగాన్ని ఈ రకంగా వెల్లడించింది.

చెప్పుమని రామచంద్రుడు
చెప్పించిన పలుకు మీద జెప్పెదనే, నె
ల్లప్పుడు నిహపర సాధన
మిప్పుణ్య చరిత్ర, తప్పులెంచకుడు కవుల్

కావ్యారంభంలోనే దేవతాస్త్రీ స్వభావ వర్ణన చేస్తూ తనదైన ప్రత్యేకతను వెల్లడిస్తూ జగన్మాతయైన పార్వతిని "సామజ యుగ్మమింపలర" అని, సంపదలిచ్చే లక్ష్మీదేవిని **"కాముని తల్లి"** అని బ్రహ్మ వెంట నడయాడు సరస్వతిని "విద్యాలయ" అని సంభావించింది. ఈ మూడు భావనలు స్త్రీ సహజమైన కోమలత్వానికి చిహ్నాలు. వర్ణన ద్వారా వ్యక్తిని మన కళ్ళముందర నిల్పగల నైపుణ్యం మొల్ల లేఖినికి తెలుసు.



ఈ పద్యం చూడండి–

*"కట్టిన వస్త్రంబు కట్టుకొంగే తక్క*
*జీర్ణించి పోయిన చీర యెడ*
*మడుగని వగలచే నోరంత ప్రొద్దును*
*జెక్కింట జేర్చిన చేయితోడ*
*బుడమిపై బొరలాడు నొడలు బూడిద బ్రుంగి*
*నిరతంబు దొరగు కన్నీటి తోడ*
*నిడుద పెన్నేటివేణి సడలించి జడలతో*
*నిరత నిరాహార నియతి తోడ*

*గినుక జంకించు దైత్యకామినుల నడుమ*
*దపము చేయుచు దనుజ బాధలకు నోర్చి*
*వనిత ప్రాణంబు దక్క సర్వము దృజించి*
*నిత్యమును మిమ్ము మదిలోన నిల్పియుడు"*

దిగులుతో కృశించిన సీతా దేవి రూపం మనకు కళ్ళెదుట ప్రత్యక్షమవుతుంది ఈ వర్ణన ద్వారా. ఈ వర్ణనకు సీసపద్యం ఎన్నుకోవడంలోనే ఒక ప్రత్యేకత కన్పిస్తుంది. ధారగా ప్రవహించే కన్నీటిలో, ఎడతెగని బాధతో బెంగటిల్లుతున్న సీత మానసిక స్థితి – ఎక్కడా ఆగక నడిచిపోయే సీసపద్య నడకలో గోచరిస్తుంది. ఇది ఏకతాళంలో లేదా రూపకతాళంలో గానం చేయవచ్చును. ఇది ఆమె లయ పరిజ్ఞానాన్ని సూచిస్తున్నది. ఇదే సీస పద్యాన్ని ఇంకొక సందర్భంలో విచిత్రమైన నడక నడిపించింది. ఇందులోని అంతర్గత లయ ఎగురుతున్న వానరులను కళ్ళెదుట నిలుపుతుంది. చూడండి.

*ఒక్కడాకొని కొమ్మలూచిన బండ్లెల్ల*
*జేకొని తేర భక్షించు నొకడు..*
*ఒక్కడాకొని రేపుచున్నట్టి తేనియల్*
*తడయక కొట్లాడి త్రాగునొకడు..*

ఒక్కడాకొని కోయుచున్నట్టి కాయలు
మిన్నక యూటాడి మ్రింగునొకడు..
ఒక్కడాకొని గోళ్ళ నొంచినట్టి చివుళ్ళ
బుక్కిళ్ళ కొలదిగా బొక్కునొకడు..

తరువుపై నుండి తరువుపై దాటునొకడు..
పండ్ల కెటువంటి మ్రాకైన బ్రాకునొకడు..
దిగువ కూర్చుండి తరువున కెగురు నొకడు..
పెద్ద పొదవున నుండి కుప్పించు నొకడు..

ఇది ఝంప తాళంలో గానం చేయవచ్చును. ఈ తాళం ఉత్సాహాన్ని ప్రకటించే తాళం. ఈ పదాలలో చిందిన లయ సహజమైన వానర చేష్టలను కళ్ళముందు నిలుపుతుంది. ఈ పద్యంలో అంతటి ఉత్సాహాన్నిచ్చే లయ ఉంది.

పదాలలో పొదుపు చూపిస్తూనే అనూహ్యమైన రీతిలో వ్యక్తులను వర్ణించడం ఈమె ప్రత్యేకత. ఈ పద్యం చూడండి.

నీలమేఘ చ్ఛాయ బోలు దేహము వాడు
ధవలాబ్జ పత్ర నేత్రముల వాడు
కంబు సన్నిభమైన కంఠంబు గలవాడు
బాగైన యట్టి గుల్ఫము గలవాడు
తిన్ననై కనుపట్టు దీర్ఘ బాహువుల వాడు
ఘనమైన దుందుభి స్వనము వాడు
పద్మరేఖలు గల్గు పద యుగంబు గలవాడు
చక్కని పీన వక్షము వాడు

కపట మెరుగని సత్యవాక్యముల వాడు
రమణి! రాముండు శుభ లక్షణముల వాడు

అంటూ ఆదితాళపు నడకలో స్థిరంగా, గంభీరంగా రామచంద్రుని రూపు కట్టించి మరుక్షణమే అంతవరకు రాముని వెనకాల నిలబడి యున్న లక్ష్మణుని ముందు నిలబెట్టింది ఒకే వాక్యంతో. చూడండి.



ఇన్ని గుణముల రూపింప నెసగు వాడు
వరుస సౌమిత్రి బంగారు వన్నెకాడు

రామ సౌందర్యాన్ని ఒక రాగవరుసలో చెబుతూనే చివరికి ముక్తాయింపు స్వరం ఇచ్చినట్లు లక్ష్మణుని వర్ణించటంలో మొల్ల విశిష్టత అర్థమవుతుంది. పై పద్యం కూడా సీస పద్యమే. కాని ఏ పాదానికి ఆ పాదం విరిగి పోయి ఒక స్టేట్‌మెంట్ ఇస్తున్నట్లు అన్పిస్తుంది. ఇందులోని లయ చాలా గంభీరమైనది. పైన ఉదాహరణలలో చెప్పిన మూడు పద్యాలు సీసపద్యాలే అయినప్పటికీ మూడింటి లయ ఎంతో భిన్నంగా ఉంది. ఈ విధమైన రచన మొల్ల లయ పరిజ్ఞానానికి ఎత్తిన పతాక. సంగీత పరిజ్ఞానం లేకుండా ఇంత లయాత్మకత సాధించటం అసాధ్యం. అసాధ్యాన్ని సుసాధ్యం చేసిన మొల్ల అభినందనీయురాలు.

## మరెందరో..

దక్షిణాంధ్ర సాహిత్యంలో మనకు విదుషీమణులెందరో కన్పిస్తున్నారు. ఉదాహరణకు ఇద్దరిని పరిచయం చేస్తాను. సాహితీ భోజుడనిపించుకున్న తంజావూరు రఘునాథరాయని కాలంలో విలసిల్లిన ప్రఖ్యాత కవయిత్రి రామభద్రాంబ. ఈమె రచించిన తెలుగు గ్రంథాలేవి కూడా ఇంతవరకు వెలుగు చూడలేదు. కాని సమకాలీనులైన కవుల రచనలలో ఈమె తెలుగు కవయిత్రిగా కీర్తింపబడింది. ఈమె ఆ కాలంలో 'అష్టభాషా విశారద' అని పేరు పొందింది. ప్రతిభకు స్త్రీ పురుష భేదం లేదన్న విషయం ఈమె ద్వారా మరొక్కసారి నిరూపించబడింది.

ఈ ఆస్థానంలోనే గల మరొక్క విదుషీమణి పసుపులేటి రంగాజమ్మ. రంగాజీ అన్న పేరుతో వ్యవహరింపబడింది. ఈమెకు కేవలం సంగీత సాహిత్యాలే కాక అభినయమందు కూడా చక్కని అభినివేశం ఉంది. ఈ ప్రజ్ఞ మనకు రంగాజమ్మ రచించిన **'మన్నారు దాస విలాసము'** అన్న నాటకంలో కన్పిస్తుంది. రామభద్రాంబ లాగా ఈమె కూడా అష్ట భాషలలో విశారదురాలు. విశేషించి విజయరాఘవ నాయకుని చేత కనకాభిషేకం చేయించుకున్న విదుషీమణి. సంవాద రీతిలో నడిచిన ఒక పద్యాన్ని గమనించండి.

*"రాజ నిభాననా ! సరసురాలవు, జబ్బుగ నల్లినావదే*
*మే జడ? 'యింతకంటె వలెనే' వలనొప్ప బిగించి యల్లవే*
*ఓ జవరాల ! వేఱె పనియున్నది 'దోసమె', దోసమే! మహా*
*రాజగునట్టి యవ్విజయ రాఘవు మై చిగురాకు కోమలీ !"*

చతురశ్ర గతిలో నడుస్తున్న ఈ పద్యంలో మధ్య మధ్యలో అతీత తాళంలో పదం మొదలవటం గమనిస్తే కవయిత్రి లయ పరిజ్ఞానం అర్థమవుతుంది. ప్రశ్నకు సమాధానానికి మధ్యగల నిశ్శబ్ద క్రియలు పద్యగమనానికి ఎంతో అందాన్ని తెస్తాయి.

దక్షిణాంధ్ర యుగంలో సంగీత సాహిత్యాలు సరిసమానంగా పోషింపబడ్డాయి. దీనితో పాటు అభినయానికి కూడా పెద్ద పీట వేశారు. అందుకే పద్యాల నడకలో ఈ మూడింటి లక్షణాలు కన్పిస్తాయి. సంగీత నాట్యాలకు సంబంధించిన ఎన్నో లక్షణ గ్రంథాలు ఈ యుగంలోనే రావడం గమనార్హం. ముఖ్యంగా చెప్పుకోదగ్గది 'తాన నిఘంటువు' – ఇది సంగీత శాస్త్ర నిఘంటువు. ఒక శాస్త్రాన్ని అనుసరించి నిఘంటువు రచింపబడిందంటే దాని వైశిష్ట్యం మనం అర్థం చేసుకోవచ్చును.

## బాల గేయాలు

తెలుగు భాషలో బాలసాహిత్యమనే ప్రక్రియ ఉంది. బాల గేయాలు గాని, వాటి కర్తలు గాని ఏ కాలంనాటివో చెప్పలేము. పిల్లల మనసెరిగిన తల్లులు, తల్లి ప్రేమకు పాత్రమైన బిడ్డలు తొలి కవులుగా పరిగణింపబడాలి. "బాల వాఙ్మయంలోని బాల పాటలకు, కథలకు తల్లి హృదయమే కర్తృత్వం వహిస్తుంది'' అని చింతా దీక్షితులు గారన్నారు. "తీయని పెదవులతో బిడ్డను మనసారా స్పృశిస్తుంది తల్లి. బిడ్డ కళ్ళనిండా తల్లి మొగమే కన్పిస్తుంది. ఆ మధుర హృదయం నుంచి ఏవో పిలుపులు, గుసగుసలు మాటలుగా, పాటలుగా పొంగాయి. తల్లి బిడ్డల మధ్య ఆ నిముషంలో కాలాన్ని స్తంభింప చేసిన ఆ నిముషంలో వెలువడిందే బాలసాహిత్యానికి ఆలంబనం. ఆ మాటలే, ఆ పాటలే ఏ నాటికీ చెరగని తరగని మధుర నిధులు" అంటారు నార్ల చిరంజీవిగారు. అటువంటి బాల గేయాలకు అజ్ఞాత కర్తలైన మాతృమూర్తులను స్మరించటం అనుచితం కాదనుకుంటాను ఈ సందర్భంలో. నిజానికి వీరే తొలి స్త్రీ వాగ్గేయకారులు నా దృష్టిలో. తన కంటిపాపను ఆప్యాయంగా హృదయానికి హత్తుకున్న తల్లి నోట అప్రయత్నంగా అవ్యక్తమైన రాగం దానివెంట ఏవేవో పదాలు దొర్లుతాయి. కాలక్రమేణా అవే బాలగేయాలుగా రూపాంతరం చెంది ఉంటాయి. ఈ బాలగేయాలు ముఖ్యంగా తల్లి బిడ్డలకు సంబంధించినవి కావటం చేత ఈ గేయాల కర్తలు స్త్రీలే అనటంలో సందేహం లేదు. అటువంటి కొన్ని బాలగేయాలను ఇక్కడ ప్రస్తావిస్తున్నాను. ఈ ఉగ్గుపాట గమనించండి.

*ఊఉ ఉఉ ఉంగన్న*
*ఉగ్గుపాలు ఇందన్న*
*గంటెడు ఉగ్గు కమ్మన్న*
*ఉమ్మక కక్కక మింగన్న*

అంటూ తనకు తెలిసిన పదాలతో ఒక చిన్నగేయం కల్పించిందా తల్లి. ఇందులోని భావం, రాగం బిడ్డకు అర్థమయే అవసరం లేదు. తల్లికే బిడ్డ జీర్ణశక్తి పెరగాలన్న తపన తప్ప. ఇంకా ప్రత్యేకించి అర్థం లేదు కూడా.

ఎందుకో తెలియక ఏడుస్తూన్న తన బిడ్డను చూసి చలించిపోయిన తల్లి అప్రయత్నంగా

*ఏడవకు ఏడవకు వెర్రినాగన్న*
*ఏడిస్తె నీ కళ్ళు నీలాలు గారు*
*నీలాలు గారితే నే జూడలేను*
*పాలైన గారవే బంగారు కనుల*

అంటూ ఓదార్చటానికి ప్రయత్నిస్తుంది.

విద్యాబుద్ధులు, సంప్రదాయాలను నేర్పడంలో తల్లికి సాటి లేరెవ్వరు. పసితనంలోనే తన పాపకు ఎవరెవరి పట్ల భక్తి ప్రదర్శించాలో తల్లి ఇట్లా చెబుతుంది.

*లాలను పోసి, పాలను తాపి*
*జోలను పాడే, అమ్మకు జేజే...*

నడువగ చూచి, అడిగినవన్ని
తడయక ఇచ్చే, నాన్నకు జేజే...
మాటలు నేర్పే, పాటలు నేర్పే
ఆటలు నేర్పే, గురువుకు జేజే ॥

ఈ బాలగేయాలు, రాగాలు కూడా అతి సున్నితమైనవి. ఎక్కువ గమకాలు ఇత్యాదులు లేనివి. అందుకే ఎంతకాలం గడచినా ఆయా రాగాలలో చెప్పుకోదగ్గ మార్పులు రాలేదు. ఆ లాలిపాట, దానిరాగం, తల్లి నెమ్మదిగా జోకొట్టే విధానం పాపాయిని వెంటనే నిద్ర పుచ్చుతాయి. ఈ గేయాలు కల్పించిన ఆ తల్లులెవరో గాని ఆ రాగ విచక్షణ, తాళ పరిజ్ఞానం గమనిస్తే వారి ప్రతిభ మనకు అబ్బురమన్పిస్తుంది. ఈ గేయాల ద్వారా తమకొక స్థానం ఏర్పడాలని, తద్వారా సమాజం తమని ప్రత్యేకంగా సంభావించాలని ఆశించలేదా తల్లులు. అజ్ఞాత వాగ్గేయ కారులైన ఈ మాతృమూర్తులకు తలవంచి ప్రణామం చేయటం ద్వారా మన కృతజ్ఞతలు తెల్పుకుందాం.



గమ్యస్థానాన్ని చేరుకునేందుకు చేసే ప్రయత్నంలోనే ఆనందం ఉంది.



మన సంతోషం మన తెలివితేటలపైనే ఆధారపడి ఉంటుంది.



జీవితం ఆనందంగా ఉండాలంటే పరులతో పోల్చుకోకుండా జీవించు.



ఉత్తమమైన వారు తమ ఆనందాన్ని పదిమందితో పంచుకుంటారు. తమకు కలిగిన విషాదాన్ని తమలోనే దాచుకుంటారు.



# తమిళం

**త**మిళ సాహిత్య చరిత్ర గురించి తెలుసుకునే ముందు తమిళ శబ్ద వ్యుత్పత్తి తెలుసుకుందాం. 'తమిళ్' అనే మాటకు నిఘంటువు మాధుర్యం అనే అర్థాన్ని చెబుతున్నది. కొందరు పండితులు తమిళ శబ్దాన్ని తమి అంటే ప్రత్యేకం, ఇళ్ అనగా మధురం అని అంటే తమిళం ప్రత్యేకమైన మధురిమ గల భాష అని చెప్పారు. 'తేను త్తైత్తమిళ్" అంటే తేనె వలె తీయనైన తమిళము అని, "తమిళ్ తళ్ ఇయ శాయలదర్"[1] అంటే మనోజ్ఞమైన తమిళము అని తమిళ ప్రాచీన గ్రంథాలు చెబుతున్నాయి. పింగళముని చేత సంకలనం చేయబడిన 'పింగలందై" అనే ప్రాచీన తమిళ నిఘంటువు తమిళ శబ్దం గురించి ఇట్లా చెప్పింది. ''ఇనిమైయుం (మధురమైనది), నీర్మైయు (సంస్కరించబడినది) తమిళెనలాగుం" పై అభిప్రాయాలన్ని పరిశీలించిన మీదట తమిళ భాష తేనె లాగా మధురమైనది అని తేలుతున్నది.

భారతదేశంలో అన్ని భాషల కంటే అత్యంత ప్రాచీనమైనది తమిళం. చరిత్రకందినంతవరకు క్రీ.పూ. 5వ శతాబ్దం నుండి తమిళ భాషా సాహిత్యాలు కన్పిస్తున్నాయి. సంస్కృతం ఉన్నతస్థాయి నందుకున్న తర్వాతి కాలంలో భారతదేశంలోని అన్ని భాషల మీద సంస్కృతం తన ప్రభావాన్ని ఎంతో కొంత చూపింది. కాని సంస్కృత ప్రభావం తమిళం మీద చాలా స్వల్పం. తెలుగు, కన్నడ, మలయాళ భాషలలో తొలి అనువాద గ్రంథాలు రామాయణ మహాభారతాలు అయితే తమిళ భాషలో తొలి రచనలు స్వతంత్రములు. ఇతివృత్త స్వీకరణ, కథా సంవిధానం, వర్ణనలు ఇత్యాదులలో ప్రాచీన తమిళ కవులు తమదైన ప్రత్యేకతను ప్రదర్శించారు. జైన, బౌద్ధమత సంపర్కం వల్ల తమిళ సాహిత్యంలో చెప్పుకోదగ్గ మార్పులు ఏర్పడ్డాయి. భాషాపరంగా, సాహిత్య పరంగా ప్రాచీన కాలంలోనే ఎంతో అభివృద్ధిని సాధించిన తమిళ భాషలో అక్షరాలు మాత్రం కేవలం 30. వీటిలో అచ్చులు 12, హల్లులు 18. అల్పాక్షరముల అనల్పార్థ రచన అంటే మొదటగా చెప్పవలసినది తమిళ భాష గురించే అంటే అందులో సందేహం లేదు.

తమిళ సాహిత్యాన్ని రెండు విభాగాలుగా మనం చూడవచ్చును. మొదటిది 'ఇయల్' (సాహిత్యం), రెండవది 'ఇశై' (సంగీతం). ఇందులో ఇయల్‌ని అంటే సాహిత్య భాగాన్ని మళ్ళీ రెండుగా విభజించారు. మొదటిది ఇలక్కణం (లక్షణం), ఇలక్కియం (లక్ష్యం). లక్షణ శాస్త్రమైన ఇలక్కణంలో 'ఎళుత్తు' (అక్షరాలు) చొల్ (శబ్దం), పొరుళ్ (కావ్యవస్తువు) అని మూడు భాగాలు కన్పిస్తున్నాయి. తమిళ సాహిత్య చరిత్రను ఈవిధంగా విభజించారు. అవి 1) సంగ యుగం, 2) జైన బౌద్ధుల యుగం, 3) శైవ వైష్ణవాచార్యుల యుగం, 4) కవిత్రయ యుగం, 5) పురాణేతిహాస యుగం, 6) ఆధునికయుగం. తలైచ్చంగం (తొలిసంగం) ఇడైచ్చంగం (మధ్య సంగం), కడైచ్చంగం (చివరి సంగం) అని సంగయుగం మూడు విభాగాలుగా కన్పిస్తున్నది. ఈ మూడు సంగమ కాలాలలో వెల్వడిన కావ్యాలు అగం (మధుర గాథలు) అని, పుఱం (వీరగాథలు) అని విభజింపబడ్డాయి. అగనానూఱు, పుఱనానూఱు అన్న సంకలన కృతులు ఈ రెండు విభాగాలకు ప్రాతినిధ్యం వహిస్తున్నాయి. ఈ సంకలనాలు ఆనాటి తమిళ సంఘాన్ని వివరంగా వర్ణిస్తున్నాయి. వారి ఆచార వ్యవహారాలు, నిత్యకృత్యాలు, రాజుల చరిత్రలు, వారి వీరగాథలు మొదలైన వాటి గురించి విపులంగా వర్ణించబడింది. సంగయుగపు సాహిత్యమంతా ఆనాటి తమిళ సంఘ జీవనానికి దర్పణం లాంటిది.

## ఛందస్సు

తమిళ సాహిత్యం ప్రారంభమైన కాలంలో "అగవల్, కలిప్పా, పరిపాడల్" అన్న ఛందో రీతులు కన్పిస్తున్నాయి. 'అగవల్' అన్నది ఒక్కొక్క పాదంలో నాల్గు గణాలను కల్గి ఉంటుంది. పాద సంఖ్యా నియమం ఇందులో లేదు. మూడు పాదాల నుండి నూరు పాదాల వరకు ఉండవచ్చు. ప్రాచీన తమిళ కావ్యాలలో ఈ పద్ధతి కన్పిస్తుంది. చివరకు వచనం కూడా చాలాచోట్ల ఈ పద్ధతిలో కన్పించటం ఒక విశేషం. ప్రాచీన కావ్యాల వ్యాఖ్యాతలు కూడా తమ వ్యాఖ్యానాలను అగవల్ ఛందంలో రచించడం మరొక్క విశేషం. 'కలిప్పా' అన్నది నాలుగు గణాలు గల నాలుగు పాదాల రచన. దీని గణాలు చాలా ఉత్సాహభరితంగా ఉంటాయి. అందువలన దీనిని "తుక్కళ్ ఓశ్కై" (లంఘన ధ్వని) అనికూడా అంటారు. "పరిపాడల్" అన్నది సరళమైన పదబంధము గల రచన. అయితే కలిప్పా, పరిపాడల్ ఛందస్సులను కలపగా ఏర్పడిన రూపమే జనపద బాణీగా చాలచోట్ల కన్పిస్తాయి. ప్రణయ గీతాలుగాని, విరహ గీతాలుగాని, ఎగతాళి చేస్తున్నట్లు పాగే గీతాలుగాని ఈ పద్ధతిలో కన్పిస్తాయి. 'తొల్కాప్పియమ్' ఈ ఛందో విశేషాలను వివరంగా సమీక్షించింది. ఇందులో ముఖ్యంగా 'వెణ్బా' అన్న ఛందస్సు ఎన్నదగినది.

సంగసాహిత్యం తర్వాత ఈ ఛందస్సు మరింత ప్రాచుర్యాన్ని పొందింది. దీని లాగా 'పణత్తి' అన్న ఛందస్సు కూడా తొల్కాప్పియమ్‌లో కన్పిస్తోంది. ఇది ముఖ్యంగా సంగీత ప్రధానమైన రచన – "శిలప్పదిగారము" రచించిన ఇళంగో జానపద గీతాల బాణిని స్వీకరించాడు. తర్వాత వెల్లువలాగా వచ్చిన (7,8 శతాబ్దాలలో) భక్తి ఉద్యమాలలో భక్తి గీతాలను రచించిన నాయన్మారులు గాని, ఆళ్వారులు గాని లలితమైన ఛందస్సు నుపయోగించి రచన చేశారు. ఈ సందర్భంగా వెలుగుచూసిన ఇంకొక ఛందస్సు 'విరుత్తం' తమిళ పంచ మహా కావ్యాలలో ఒకటైన 'జీవక చింతామణి' ని రచించిన 'తిరుత్తక్క దేవర్' ఈ ఛందస్సును విరివిగా ఉపయోగించాడు. ఇది పూర్తిగా దేశీ లక్షణయుతమైనదిగా కన్పిస్తోంది. ఇందులో 'అగవల్' లో ఉన్నట్లు నాల్గు గణాలు ఒక పాదంలో ఉండాలన్న నియమం లేదు. ఒక పాదంలో నాల్గు గణాల కంటే ఎక్కువ కూడా ఉండవచ్చును. అయితే పాదాల సంఖ్య మాత్రం నాలుగే ఉండాలి. నాల్గు పాదాలు సమంగా కన్పించాలి. అంటే మొదటి పాదంలో ఎన్ని గణాలుంటే మిగిలిన మూడు పాదాలలో కూడా ఆ విధంగానే ఉండాలి. ఈ విధమైన నియమం వలన ఎటువంటి భావాన్ని అయినా చక్కగా వర్ణించటానికి వీలుగా 'విరుత్తం' వీలు కల్పించింది. ఈ కాలంలో సంగీత రచనలు చేసిన వారందరూ ఈ ఛందస్సును పూర్తిగా ఉపయోగించుకున్నారు.

తొలి రెండు సంధి యుగాలలో స్త్రీల రచనలు లభించలేదు. అది మన దురదృష్టం. చివరి సంధి యుగాలలో అవ్వైయార్ అన్న విదుషీమణి రచనలు కన్పిస్తున్నాయి. అవ్వైయార్ పేరుతో ఇద్దరు ముగ్గురు కవయిత్రులు కన్పిస్తున్నారు. నిజానికి అవ్వైయార్ అన్నది అసలు పేరు కాదు. పూజ్యురాలు అన్న అర్థంలో ఈ పదాన్ని ఉపయోగిస్తుంటారు. బహుశః ఈ ముగ్గురు కూడా వేర్వేరు కాలాలలో ఉండి ఉండవచ్చును. అవ్వైయార్ తన రచనతోనే గాక ప్రవర్తనతో కూడా ప్రజలకు సన్నిహితమైనది అని తెలుస్తోంది. పేదవారిళ్ళకు వెళుతూ, వారి కష్టాలలో పాలుపంచుకుంటూ, వారికి కావలసిన సహాయాన్ని అందిస్తూ అందరికీ తలలో నాల్కలాగా మసలుతుండేదన్న కథలు ప్రచారంలో ఉన్నాయి. "ఆత్తిచూడి, కొండ్రైవేందన్, నల్వళి" మొదలైన లఘురచనలు చేసినట్లు తెలుస్తోంది.

నన్ఱి మఱవేల్ – చేసిన మేలు మరవద్దు
అన్నెయుం పితావుం మున్నందెయ్‌వం – తల్లిదండ్రులే ప్రత్యక్ష దేవుళ్ళు.
ఐయమిట్టుణ్ – తినే ముందు ఇంకొకరికి పెట్టు

వంటి నీతి సూక్తులతో కూడిన ఈమె రచనలు నేటికీ తమిళుల జిహ్వాగ్రాల మీద నిలచే ఉన్నాయి.

క్రీ.శ. 6వ శతాబ్దంలో కారైక్కాల్ అవ్వైయార్ అనే విదుషీమణి రచనలు కన్పిస్తున్నాయి. ఈమె ఒక వర్తకుని భార్య. ఒక అద్భుత సంఘటన (ఇది వివరంగా ఎక్కడా వర్ణింపబడలేదు) ఆధారంగా ఆ వర్తకుడు తన భార్యను దేవతలాగా చూడటం మొదలుపెట్టాడు. తర్వాత ఆమెను విడిచిపెట్టి వేరొక సామాన్య స్త్రీని వివాహమాడాడు. జరిగిన దానికి తన ప్రమేయం ఏ మాత్రం లేదని తెలుసుకున్న అవ్వైయార్ జీవితం పట్ల విరక్తిని పెంచుకుంది. గమ్యం లేకుండా అన్ని గ్రామాలు తిరుగుతూ పరమేశ్వర ధ్యానం చేస్తూ చివరికి ముక్తి పొందింది. తనని గూర్చి తానొక కారైక్కాల్ దయ్యాన్ని అని చెప్పుకుంది. చెన్నపట్టణం నుంచి దాదాపు 30 మైళ్ళ దూరంలో ఉన్న ఈ ఊరి దేవాలయంలో నేటికీ ఈమె పేరిట పూజా ఉత్సవాలు జరుగుతున్నాయి. ఈమె పాడిన భక్తి గీతాలు "అర్పుతత్తిరువంతాది, మూత్త తిరుప్పది గంగళ్, ఇర్రట్టై మణిమాలై" అన్న పేర్లతో సంకలనం చేయబడి ఉన్నాయి. అందినంత వరకు ఈ భక్తి గీతాలు తమిళ భాషలోని ప్రాచీన శైవ మతానికి చెందిన ప్రాచీన భక్తి గీతాలుగా పరిగణింపబడుతున్నాయి. భక్తి జ్ఞాన సహితములైన ఈ గేయాలు అవ్వైయార్ గొప్పతనాన్ని చెబుతున్నాయి. అవ్వైయార్ రచనగా చెప్పబడుతున్న ఒక చిన్న ఖండిక చూడండి.

ఆట్టు విత్తాల్ ఆర్ ఒరువర్ ఆడాతారే
అడక్కు విత్తాల్ ఆర్ ఒరువర్ ఆడంగదారే ॥
కొట్టు విత్తాల్ ఆర్ ఒరువర్ కాణాదరే
కాణ్బార్ ఆర్ కణ్ను దలాయ్ కాట్టాక్కాలే ॥

నీకు అనుగుణంగానే జీవి ఆడుతాడు నీవు చూడమంటేనే ప్రపంచాన్ని చూస్తాడు అని భావం. వైరాగ్యాన్ని ప్రతిబింబిస్తున్న ఈ కీర్తన అవ్వైయార్ మానసిక పరిణతిని చూపిస్తోంది.



అవ్వైయార్ అను పేరుతో దాదాపు నలుగురైదుగురు సంగయుగంలో కన్పిస్తున్నారు. పెద్ద ముత్తైదువు అని, తల్లి వంటిది అన్న అర్థాలలో ఈ పదాన్ని ఉపయోగిస్తున్నారు. ఆదియమాన్, తొండైమాన్ అను ఇద్దరు రాజుల మధ్యగల వైరాన్ని నివారించటానికి అవ్వైయార్ రాయబారము చేసినట్లు చరిత్ర చెబుతుంది. ముసలితనం మీద పడుతున్న అవ్వైయార్ శక్తి సామర్థ్యాలు పెరగటానికి ఆదియమాన్ తన దగ్గర గల ఔషధ గుణాలతో కూడిన నెల్లికాయను ఇచ్చినట్టు, ఆతని గౌరవాభిమానాలను ప్రశంసిస్తూ రాసిన అవ్వైయార్ పద్యాలు తమిళ ప్రాంతంలో చాలా ప్రసిద్ధములు. పుఱనానూఱు గ్రంథంలో అల్వ్వాయార్ కవితలు దాదాపు 60 దాకా లభిస్తున్నాయి. ఈ కవితలు ఆమె పాండిత్యాన్ని, లయాత్మకతనే గాక లోకజ్ఞానాన్ని ఎత్తి చూపుతున్నాయి.

1) అవ్వైయార్ కాక భక్తి ఉద్యమ కాలంలో నాయన్మారుల సమకాలీనురాలిగా ఇంకొక అవ్వైయార్ కన్పిస్తున్నది. ఈమె తమిళ సాహిత్య చరిత్రలో గొప్ప ప్రతిభాశాలినియైన కవయిత్రిగా పేరు పొందింది. ఈమె బహుశః చోళరాజుల ఆస్థాన కవయిత్రి కూడా అయిఉండాలి. అయినప్పటికీ రాజభోగాలు అనుభవించకుండా ఊరూరా తిరుగుతూ పేదవారి మధ్య సంచరిస్తూ వారితో స్నేహంగా ఉంటూ, వారి కష్టసుఖాలలో పాలు పంచుకొనేది. శ్రమజీవుల సాంగత్యంలో కవితలల్లిన కవయిత్రి అని నేటికీ చెప్పుకుంటారు. ఈమె కవితలలో ముఖ్యంగా చెప్పుకోవలసినవి చిన్న పిల్లల కోసం రచించిన 'ఆత్తిచ్చూడి', కొన్రైవేన్దన్". నేటికీ వీటిలోని కొన్ని పాదాలైనా రాని తమిళ వ్యక్తి మనకు కన్పించరు.

తర్వాత ఈమె పాఠశాల విద్యార్థుల కొరకు గ్రంథ రచన చేసింది. అవి 'మూతురై, న్యళి' అన్నది. ఇది జీవిత సత్యాలను వివరిస్తూ చిన్న చిన్న సూక్తులుగా కన్పిస్తాయి. చూడటానికి చిన్నిచిన్ని పదాలతో చెప్పినట్లు అనిపించినా లోతైన, గంభీరమైన అర్థాలు కలిగి ఉంటాయి. చెప్పే పద్ధతిలో స్పష్టత ఉంటుంది. తర్వాత ఎప్పుడో 20వ శతాబ్దంలోని భారతియారు కూడా ఈమె చూపిన పద్ధతిలోనే తన కవితలు రచించాడంటే ఈమె మార్గం ఎంత అనుసరణీయమో తెలుస్తుంది. అవ్వైయార్ రచనలుగా లభించే చాటు పద్యాలు ఎన్నో దొరుకుతున్నాయి. అయితే అందులో ఎన్ని నిజంగా ఆమె రచనలు అన్నది తెలియదు. అయినప్పటికీ అవి అన్నీ కూడా రసభరితాలైన పద్యాలే.

వీటివలన అవ్వైయార్ కీర్తి ప్రతిష్టలు మరింతగా పెరిగినవని భావించవచ్చును. జ్ఞానక్కుఱళ్ అను గ్రంథ రచన చేసిన ఇంకొక అవ్వైయార్ కనిపిస్తోంది.

పెరియాళ్వారు పెంపుడు కుమార్తె ఆండాళ్. ఈమె రచనయైన 'తిరుప్పావై' తమిళ సాహిత్య చరిత్రలోనే అద్వితీయమైనది. మధురభక్తియుతములైన ఈ పాటలే నేటికి ధనుర్మాస సమయంలో ప్రతి తమిళ గృహంలో ఉదయాన్నే విన్పిస్తుంటాయి. భగవంతుని భర్తగా భావించడం మధురభక్తిలో కన్పిస్తుంది. శ్రీ రంగనాథుని భర్తగా భావించి అతనికి చేసే సకలోపచారాలు, అందుకై తన స్నేహితురాళ్ళను ఉదయాన్నే నిద్ర లేపి, వారితో కలిసి ఆలయానికి వెళ్ళి చేసే పూజలు ఇందులోని వస్తువు. ఉదాహరణకిది చూడండి.

*"ఓజ్గీ ఉలగళన్ద ఉత్తమన్ పేర్పాడి*
*నాజ్గళ్ నమ్ పావైక్కు చ్చాట్రు నీరాడినాల్*
*తీజ్గు ఇన్ట్రి నాడెల్లామ్ త్తిళ్ ముమ్మారి పెయ్దు*
*ఓజ్గు పెరుంగేన్నెల్ ఊరు కయల్ ఉగళ*
*ప్పూవళై ప్పోదిల్ పోరివన్దు కణ్బదుప్ప*
*త్తేజ్గాదే పుక్కిరున్దు శీర్తములై పట్రి*
*వాజ్గకుడమ్ నిఱైక్కుమ్ వళ్ళల్ పెరుం పశుక్కళ్*
*నీజ్గద శెల్వమ్ నిఱైన్దేల్ ఓర్ ఎంపావాయ్*

'పావై'ని పాడుతూ భగవంతుని కీర్తించినట్లయితే ఎటువంటి పీడలు ఎదురుకావు. దేశంలో నెలకు మూడు వానలు కురుస్తాయి. పొలాలన్నీ సమృద్ధిగా పండుతాయి. చెరువులలో నీళ్ళు సమృద్ధిగా నిండుతాయి. కొలనులన్నీ పూలతో అందంగా కన్పిస్తాయి. దేశంలో పశుగ్రాసం విరివిగా దొరుకుతుంది. పశుసంపద పెరుగుతుంది. ఇటువంటి అక్షయ సంపద కోసం మనం ఈ పూజ చేయాలి. ఇందులో గోదాదేవి సామాజిక స్పృహ కన్పిస్తుంది. భాష భావం పోటీలు పడుతున్న ఈ గేయం ఆండాళ్ సంగీత సాహిత్య నైపుణ్యాలకు మచ్చుతునక.

భగవానుడైన కృష్ణుడు నిరంతరం ఊదటం చేత శంఖానికి కృష్ణుని పెదవుల మాధుర్యం పూర్తిగా తెలుసును కాబట్టి ఆ వంశినే ఆ మాధుర్యాన్ని వర్ణించమని ప్రాధేయపడుతున్న ఈ గేయంలోని నవీనతను, మాధుర్యాన్ని గమనించండి.

*కర్పూరమ్ నారుమో కమలప్పూ నారుమో*
*తిరుప్పవళ చ్చెవ్వాయ్ దాన్ తిత్తిత్తిరుక్కుమో*
*మరుప్పొశిత్త మాదవన్ తన్ వాయ్ చువై యుమ్ నాట్రుముమ్*
*విరుప్పుట్రు కేయిక్కిన్దేన్ శొల్ ఆయి వెణ్ శజ్గే*

నిజానికి 'పావై' అన్నది సాధారణంగా మహిళలు పాడే పాట. మార్గశిర మాసంలో పెళ్ళి కావలసిన ఆడపిల్లలు ఉదయాన్నే నిద్రలేచి, లేవని వారిని లేపుతూ అందరూ కలిసి ఏదైనా నదీ తీరానికి వెళ్ళి స్నానం చేస్తారు. అక్కడ పూలతో, బియ్యం పిండితో ముగ్గులు వేసి వర్షాలు కురిసి చక్కని పంటలు పండాలని, తద్వారా దేశం సుభిక్షంగా ఉండాలని కోరుకుంటారు. అది చాలా ప్రాచీన సంప్రదాయం.

భక్తి ఉద్యమ కాలంలో ఈ సంప్రదాయాన్ని భగవత్సంబంధంగా మలిచిన భక్తులు తమ గేయాలలో గీతాలలో అద్భుతంగా వర్ణించారు. ఈ సంప్రదాయపు మార్గాన్నే ఆండాళ్ తన రచనలు చేసింది. సంగీత సాహిత్యాలు రెండూ రచనలో పోటీ పడటం మనం చూడవచ్చును. ఆండాళ్ కంటె ముందు ఈ 'పావై' గీతాలు మాణిక్యవాచకర్ అనే ఆళ్వారు రచించాడని తెలుస్తోంది. వాటిని 'తిరువెంబావై' అంటారు. ఆండాళ్ రచనలను 'తిరుప్పావై' అని అంటారు.

ఈ సందర్భంలో 'తిరువెంబావై', 'తిరుప్పావై'ల గురించి ఒక విషయం తప్పకుండా అందరూ తెలుసుకోవాలి. 11, 12వ శతాబ్దాలలో చోళుల పరిపాలనా కాలంలో వారు జయించిన అనేక సముద్రపు దీవులలో ఈ గీతాల సంప్రదాయం పరిచయం అయ్యింది. సయాం, మలబారు వంటి ద్వీపాలలో నేటికీ 'తియెంచాప – ప్రతిచాప' అన్న పేర్లతో గొప్ప ఉత్సవాలు చేయబడుతున్నాయి. ఈ పావై గీతాల అర్థం తెలియకున్నా మంత్రాల లాగా వీటిని ఉపయోగించడం జరుగుతోంది. 'పావై' గీతాలు అంతటి ప్రాభవం కల్గి ఉన్నాయి.

ఆండాళ్ రచించిన 'నాచ్చియార్ తిరుమొళి' భక్తిరస పూరితములైన గీతాలు. దివ్య ప్రణయిని అయిన ఆండాళ్ శ్రీ రంగనాథుని భర్తగా భావించి రచించిన మధురభక్తి భరిత గీతాలు. ముఖ్యంగా 'దారణ మాయిరమ్' అన్న గేయం వివాహ సమయంలో తప్పకుండా గానం చేస్తారు. కేవలం తమిళులు మాత్రమే గాక కన్నడిగులు, తెలుగు వారు కూడా ఈ 'తిరుప్పావై'ని తమిళంలో గాని లేదా అనువాదాలలో గాని ధనుర్మాసంలో పాడుకుంటారు. ఎన్నదగిన విషయమేమిటంటే గీతం యొక్క ఆకృతి

చరణములలోని పాదములు, పాద నిర్మాణము, ముక్తాయింపు, నడక, లయ ఇవన్నీ నాటి నుండి నేటి వరకు అదే పద్ధతిలో నడుస్తున్నాయి. ఇది గీతాల విలక్షణత.

ఆరంభంలోనే చెప్పుకున్నట్టు తమిళ సాహిత్యం భారత భాషలన్నింటిలోనూ అత్యంత ప్రాచీనమైనది. అయితే ఇక్కడ గమనించవలసిన అంశం ఒకటుంది. ఇంతవరకు లభించిన గ్రంథాలన్నింటిలో కూడా భాష చాలా సంస్కారవంతంగా కన్పిస్తుంది. అంటే రచించిన వారందరు కూడా భాష పట్ల చక్కని అవగాహన కలవారుగా కన్పిస్తారు. అందుకే ఈ గేయాల భాష చాలా నాజూకుగా, హృద్యంగా ఉంటుంది. స్త్రీ హృదయం ఈ గేయాలలో సహజంగా ప్రతిబింబించింది.

నవ విధ భక్తి మార్గాలలో ఒకటైన మధురభక్తి మార్గానికి ఈ పాశురాలు చక్కటి ఉదాహరణలు. కాని ఇందులో వివిధములైన భావనలు కూడా కన్పిస్తాయి. ఈ క్రింది పాశురంలో సంపూర్ణ శరణాగతి భావన కన్పిస్తుంది.

*మాయనై మన్ను వడమదురై మైన్దనై*
*తూయ పెరునీర్ యమునైత్తు ఱైవనై*
*ఆయర్ కులత్తినిల్ తోన్ఱుమ్ మణి విళక్కై*
*తాయై క్కుడ ల్విళక్కం శెయ్ద దామోదరనై*
*తూయో మాయ్ వన్దు నాం తూమలర్ తూవిత్తొళుదు*
*వాయినాల్ పాడి మనత్తినాల్ శిన్దిక్క*
*పోయ పిళ్ళై యుం పుగు తరువాన్ నిర్హనవుమ్*
*తీయినిల్ తూశాగుం శెప్పేలో రెమ్బావాయ్*

"మాయలలో నిపుణుడు, ఉత్తర మధురానగరమునకు ప్రభువు, పరిశుద్ధ జలముతో నిండిన యమునానది తీరమున విహరించువాడు, గోకులమును దోచిన రత్నదీపమును, కన్నతల్లి కడుపునకు వన్నె తెచ్చిన వాడును, దామోదరుడను పేరు కలవాడు అగు శ్రీకృష్ణుని చేరి పరిశుద్ధములైన పువ్వులు సమర్పించి మ్రొక్కి, నోరార కీర్తించి మనసార ధ్యానించినచో మునుపు మనం చేసిన పాపములు, ఇక ముందు సంభవించగల పాపములు కూడా నిప్పున బడిన దూదివలె భస్మమగును" అని భావం.



ఈ విధంగా భగవంతుని కీర్తించి అనన్యమైన తన భక్తి తత్పరతలతో స్వామిని భువికి దించింది గోదాదేవి. భగవంతుని వలచి వలపించుకుంది. ఈనాటికి ఈ పాశురాల ప్రాచుర్యం తగ్గలేదు. అంత భక్తియుత రసగుళికలు ఇవి. ఇందులోని పదాల కూర్పు, భావ లాలిత్యం ఒకదానితో ఒకటి పోటీ పడ్తాయన్పిస్తుంది. ఈమె పాశురాలలో భక్తితోపాటు సమాజశ్రేయస్సు కూడా కన్పిస్తుంది. ఉదాహరణకు ఈ పాశురం చూడండి–

*ఓఙ్గ యులగళన్ద వుత్తమన్ పేర్ పాడి*
*నాఙ్గళ్ నమ్పా వైక్కుచ్చాత్తి నీరాడినాల్*
*తీఙ్గిన్ఱి నుడెల్లాం తిఙ్గళ్ ముమ్మారి పెయ్దు*
*ఓఙ్గ పెరు శ్ఙెన్నె లూడు కయలుగళ*
*కూఙ్గు వళై ప్పోదిల్ పోరిపఙ్గు కణ్బడుప్ప*
*తుఙ్గదే పుక్కిరిన్దు శీర్త్తములై పత్రి*
*వాఙ్గ కుడం నిఱైక్కుం వళ్ళల్ పెరుమ్పుశుక్కల్*
*నీఙ్గద శెల్వం నిఱైన్దేలో రెమ్బావాయ్*

"పరాక్రమంతో మూడు లోకాలను తన దివ్య చరణముల చేత కొలిచిన పురుషోత్తముని దివ్యనామములు పాడుచు, మన వ్రతమునకు తగినట్లు వేకువఝామున లేచి స్నానమాడినచో, సర్వదేశములందును నెలకు మూడు వానలు కురియును. పొలములలో వాలుగ చేపలు త్రుళ్ళింత లిడుచుండును. కలువలలో తుమ్మెదలు నిద్రించును. గొప్ప ఆవులు పొదుగున చెయ్యిపెట్టి పిండుకొలది కుండల కొలదిగ పాలు విడువక కురియును. ప్రజలందరికి తరగని సంపదలు నిండును" అని దీని భావం. ఈ పాశురంలో భక్తితో పాటు సంఘ శ్రేయస్సు కూడా కన్పిస్తుంది. అంటే భక్తులు లోకంపట్ల విరక్తులు కారని అర్థం. దక్షిణ భారతదేశంలో తలమానికమని చెప్పదగిన వాగ్గేయకారులలో ఈమె ప్రథమురాలు అని చెప్పటం అతిశయోక్తి కాదు.

## జానపద సాహిత్యం :

సాహిత్యాభివృద్ధికి మూలాధారంగా, శక్తిమంతంగా ఉండేవి జానపద గీతాలే. ఇందులోని జీవశక్తి అనంతమైంది. తమిళ సాహిత్యంలో జానపద గీతాలకు ప్రత్యేక

స్థానముంది. సుమారు నూరు సంపుటాలుగా జానపద గీతాలు నేడు లభిస్తున్నాయంటే జానపద గీతాల పట్ల తమిళులు చూపించే అభిమానం అర్థం అవుతుంది. ప్రాచీన సాహిత్యపు మూలాలు జానపద గీతాలలో కన్పిస్తుంది. ప్రకృతితో మమేకమైన గ్రామీణ ప్రజల జీవనవిధానం ముఖ్యంగా స్త్రీల పాటలతో జానపద గీతాలు పరిపుష్టిని చెందాయి. కేవలం భావ సంపద మాత్రమే గాక భాషలో కూడా తమదైన ప్రత్యేకతను నిరూపించుకున్నాయి, ఈ జానపద గీతాలు. ఈ జోలపాటను గమనించండి.

*ఆరారో ఆరారో కణ్ణేని ఆరారో ఆరారో*<br>
*ఆరడిత్తార్ నీ ఆ దాయ్ – కణ్ణే ఉన్నై*<br>
*ఆడిత్తవరై చ్చొల్లి ఆయి*<br>
*మామి ఆడిత్తాళో – ఉన్నై*<br>
*మల్లిగైప్పూచ్చెణ్డాలే ॥*<br>
*మామన్ ఆడిత్తానో – ఉన్నై*<br>
*అలరిషప్పూ చ్చెడ్డాలే ॥*<br>
'నిద్రపో నిద్రపో కన్నా నీవు నిద్రపో<br>
*ఎవరు కొట్టారు నీవేడుస్తావు? కన్నా*<br>
నిన్ను కొట్టిన వారి పేరు చెప్పు<br>
అత్త కొట్టిందా నిన్ను మల్లెపూచెండుతో<br>
మామ కొట్టాడా నిన్ను మాల వేసే చేతితో

సున్నితమైన భావాలతో తన బిడ్డడిని అలరించే తల్లి జోలపాట మన మనస్సులకు హత్తుకుంటుంది. ఇంకో జోలపాట చూడండి–

*పాణ్ణి ఆడిచ్చా ళో పాల్వా ర్క్కుం కైయాలే*<br>
*అణ్ణా అడిచ్చానో అరైణ్ కయిట్టాలే*<br>
*ఆణ్ పనైయిల్ నుంగే అణిల్ కోదా మాప్పుళిమే*<br>
*కూప్పిట్టనాన్ కేట్పాన్ కుంజరమే కణ్వళరాయ్*

"పాలు పోసే చేతితో అవ్వ కొట్టిందా? మొలతాడుతో అన్న కొట్టాడా? ఉడుత కొట్టిన ఓ మామిడి పండా? పిలచి నేను అడుగుతాలే! ఓ చిన్నా నిద్దురపో'' అని భావం.

శిలప్పదిగారంలో నాటి జానపద గేయాలు స్వీకరించబడ్డాయి. అందులో ముఖ్యంగా స్త్రీలు పాడిన పాటలుగా కొన్న పేర్కొనబడినవి. బంతి పాట, ఊయల పాట, వడ్లు దంచుతూ పాడే పాట, అచ్చనగాయలాడుచూ పాడే పాట మొదలైనవి అందులో కన్పిస్తున్నాయి. ఉదాహరణకు బంతి ఆట ఆడుతున్నప్పుడు స్త్రీలు పాడిన పాట చూడండి.

*పొన్నిలంగు పూంగొడి పొలం శెయ్ కోదై విల్లిడ*<br>
*మిన్నిలంగు మేగలైగళ్ అర్ప అర్ప ఎంగణుమ్*<br>
*తెన్నన్ వాయిగ వాయిగ ఎన్ఱు శెన్ఱు పన్దడి త్తుమే*<br>
*దేవర్ ఆర మార్పన్ వాయిగ ఎన్ఱు పన్దడి త్తుమే*

కృష్ణుని వేణునాదాన్ని స్మరించుకుంటూ గొల్ల వనితలు తమలో తాము మాట్లాడుకుంటున్న సందర్భంలోని గీతమిది.

*"పాముృ కయి ఱాగ కడల్ కడైన్ద మాయనన్*<br>
*ఈఙ్గనమ్ అనుళ్ వరుమేల్ అవన్ వాయిల్*<br>
*అమ్బలన్ తీంగుయిల్ కేళాయో తోయి"*

నిత్యకృత్యాలు చేసుకుంటూ శ్రమ తెలియకుండా కూనిరాగం తీసే స్త్రీలు ఈ పాటలన్నింటికి పునాదులు ఏర్పరచారు. వీరి కూనిరాగాల ఆధారంగానే తర్వాతి కాలాలలో కవులు ఆ మార్గాన్ని అనుసరించి ఆ రాగాలలో లేదా దానికనుగుణంగా కవితలు చెప్పారు.



# కన్నడం

కన్నడ భాషలో తొలి ఆధికారిక రచన 10వ శతాబ్దం నాటిది. నాటి నుండి మార్గపద్ధతిలో ఎంతో సాహిత్యం ఉత్పన్నమైంది. ధర్మ ప్రచారమే ధ్యేయంగా నాటి రచనలు కన్పిస్తున్నాయి. బసవేశ్వరుని రాకతో కన్నడ సాహిత్యంలో చెప్పుకోదగిన మార్పులు ఏర్పడ్డాయి. సామాన్యులను దృష్టిలో పెట్టుకొని రచించిన ఈతని రచనలు చాలా సరళమైనవి. కన్నడ పలుకుబడులు పుష్కలంగా ఉండి జనరంజకాలైనాయి. ముఖ్యంగా గానానుకూలమైన 'రగళె' ద్వారా జనాళికి దగ్గరైన కన్నడ సాహిత్యం సంగీత సహితమై అనేక తాళాలతో కూడా కొత్త రూపును సంతరించుకున్నది. త్రిపది, షట్పది వంటి రచనలు గానానుకూలమై ప్రజాసామాన్యంలో చాలా ప్రచారం పొందాయి. దీనితోపాటు 'హదుగబ్బ' అనే గేయ సరళి కూడా ప్రచారం పొందింది. ఇది పదకొండు గణాల గేయం. క్రమంగా ఇది క్రమబద్ధమైన వచనంగా మారి ఎంతోమంది వచనకారులను సృష్టించింది. ఈ కాలంలో దాదాపు 30 మంది స్త్రీలు రచనలు చేసినట్లు కన్నడ సాహిత్య చరిత్ర చెబుతున్నది. వీరిలో కొందరు తమ భర్తలతో కలిసి సంయుక్తంగా రచన చేసినట్లు తెలుస్తోంది.

రాశిలోగాని, వస్తు వైవిధ్యంలోగాని, రచనావైశిష్ట్యంలో గాని కన్నడ సాహిత్యంలో స్త్రీల రచనలు తమదైన ముద్రను ప్రత్యేకంగా వేసుకున్నాయి అనడంలో విప్రతిపత్తి లేదు.

## ఛందస్సు

త్రిపది, షట్పది అన్న ఛందో రీతులు 7వ శతాబ్దం నుండి ప్రాచుర్యంలో ఉన్నాయి. 10వ శతాబ్దం నుండి రకరకాల ఛందస్సులు ఉపయోగింపబడ్డాయి. 1) ఇది రాగలె – ఇది వర్ణనీయ కవిత, 2) సాంగత్య – వాయిద్య సహకారంతో పాడబడేది, 3) అక్కర – వృత్తం.



11వ శతాబ్దంలో ప్రఖ్యాతి చెందిన నాగచంద్రుని సమకాలికురాలైన 'కంతి' అన్న విదుషీమణి కన్పిస్తోంది. 'అభినవ వాగ్దేవి' అని 'అధిక కవీశ్వరి' అని తర్వాతి కాలంలోని కవుల చేత పొగడబడినదీమె. "కంతి హంపన సమస్యెగళు' అన్న పద్యాల సంకలన గ్రంథం ఈమె పేరుతో లభించింది. ముఖ్యంగా సమస్యాపూరణం ఈమె ప్రత్యేకత వలె కన్పిస్తోంది. ఉదాహరణకు

*వన దొళగె పుట్టి బెళెయుతె తనిగంపం పత్తు దెసెగె బీరుత్తిర్పా ।*
*ఘనతర సురుచిర సచ్ఛం ।*
*దనవం కడికడిదు బసదిగె (ళె) యుత్తిర్దర్*

ఈ పద్యంలో మొదటి మూడు పదాల భావం వేరు, సమస్యగా ఇచ్చిన పాదభావం వేరు. పశువును నరికి నరికి జినగేహమునకు లాగుచుండిరి అన్నది చివరి పాద భావం. అయితే జైన ధర్మంలో హింసకు తావు లేదు. అందువలన దానిని ఈ విధంగా అర్థం చేసుకోవాలి. 'వనమున పుట్టి పెరుగును । సౌరభమును దశదిశలా వ్యాపింపచేస్తూ ఘనతర సురుచిత పచ్చదనమును నరికి నరికి (బసదిగె) జైన గృహమునకు లాగుచుండిరి. భావంలో హింసను సూచించినప్పటికి దానిని అహింస పరంగా చెప్పిన ఈ కవయిత్రి వైదుష్యం ఎన్నదగినది. చరిత్ర కందినంత వరకు 'కంతి' ప్రథమ కన్నడ కవయిత్రి అని చెప్పవచ్చును.

దాదాపు 12వ శతాబ్దానికి చెందిన దేవర దాసిమయ్య అనే కవి దాదాపు 150 పద్యాలు రచించినట్లు, అవి ఏకేశ్వరోపాసనకు చెందినవిగా గుర్తించడం జరిగింది. ఈతని భార్య దుగ్గలె మొదటి కన్నడ స్త్రీ విదుషీమణిగా ఆ కాలంలో పేరు పొందినట్లు చరిత్ర చెబుతున్నది. అయితే ఈమె రచనలు చాలావరకు అలభ్యాలే.

బసవన్న సోదరి నాగలాంబిక, బసవన్న ఇద్దరు భార్యలు గంగాంబిక, నీలాంబిక, కూడా ఆ కాలంలో పేరు పొందిన రచయిత్రులు. అదే విధంగా సత్యాక్క అనే కవయిత్రి రచనలు సరళమైన భాషలో ఉండి అక్కమహాదేవి రచనలతో పోల్చదగినవిగా ఉన్నాయని చరిత్ర చెబుతున్నది. కేలవ్వె – సామాజిక స్పృహ కల్గిన కవయిత్రి. మహాదేవి, లింగమ్మ మాయాజగత్తును నిరసిస్తున్న కవితలు. అమ్ముగె రాయమ్మ, అక్కమ్మ సమాజంలోని కపటత్వాన్ని నిరసించాడు. కదిరె రెమవ్వ, ముత్యక్క రచనలు

సంఘ సంస్కరణాభిలాష కవితలు. ముత్యక్క కూడా అల్లమప్రభుతో వాగ్వివాదం జరిపినట్లు చరిత్ర. అలాగే అక్కమ్మ, కేటలాదేవి, గుడ్డవ్వ, బొంతదేవి – సామాజిక దురాచారాలను నిరసిస్తూ చేసిన కవితలు.

కన్నడ సాహిత్య జగత్తులో తలమానికమైన అక్కమహాదేవి రచనలు చూద్దాం.

"ఎన్న మాయద మదవ మురియయ్యా
ఎన్న కాయద కత్తలెయ కళేయయ్యా
ఎన్న జీవద జింజడవ మణిసయ్యా
ఎన్న దేవ చెన్న మల్లికార్జున దేవయ్యా
ఎన్న సుత్తిద ప్రపంచ వ బిడిసు నిమ్మధర్మ"

వస్తువులో నిగూఢమైన పదార్థాలను వెలికి తీయటానికి ఎంతో ప్రయత్నం (అంటే గింజల నుండి నూనె మొదలగునవి) అవసరం. అదే విధంగా ఈ దృశ్యప్రపంచం మరుగున భగవంతుని దర్శించడం కూడా ఎంతో కష్టం. దానికి విశేష సాధన కావాలి. ఈ అభిప్రాయాన్ని అక్కమహాదేవి ఎంత సులభమైన ఉదాహరణలతో చెపుతుందో చూడండి.

నెలదమరెయ నిధాన దంతె
ఫలద మరెయ రుచియంతె
శిలెయ మరెయ హేమదంతె
తిలద మరెయ తైలదంతె
మరద మరెయ తేజదంతె
భావద మరెయ బ్రహ్మ నొగిప్ప
చెన్న మల్లికార్జునన నిలవారూ అరియబాదు

పై రెండింటి కంటె సంగీత సాహిత్యాలలో ఉదాత్తంగా చెప్పిన ఈ వచనం గమనించండి. ఇందులో పూర్తి శరణాగతి తత్త్వం కన్పిస్తుంది. మోక్షాన్ని పొందటానికి కర్మ, యోగ, జ్ఞానాల వంటి మార్గాలు ఉన్నాయి. కాని నిజమైన భక్తులకు భగవంతుని సాక్షాత్కారమే ప్రధానం. వారికి మోక్షం కూడా తర్వాతిదే అన్న భావన గల ఈ వచనం అక్కమహాదేవి భక్తి తత్పరతకు శిఖరాయమానమైనట్టిది.



నిన్నరికెయ నరకవే మోక్ష నోడయ్యా
నిన్నరి యద ముక్తియే నరక కండయ్యా
నీ నొల్లద సుఖవే దుఃఖ కండయ్యా
నీ నొవిద దుఃఖవే పరమ సుఖ కండయ్యా
చెన్న మల్లికార్జున య్యా నీ కట్టి కెడ హిద
బంధన వే నిర్బంధన వెందిప్పను

'భగవంతుడు లేని స్వర్గం కంటె నరకమే సుఖం' అన్న భావన ఎంతో గొప్పది. ఈ వచనాలన్ని గానానుకూలమైనవి. స్త్రీ సహజమైన పదలాలిత్యము, భావ లాలిత్యంతో పాటు లయాంతర్గతమైన ఈ వచనాలు కన్నడ సాహిత్యానికి మకుట ప్రాయమైనవి. అక్కమహాదేవి – మంత్రోగప్య, యోగాంగ త్రివిధి అనే పుస్తకాలు రచించింది.

అక్కమహాదేవి తర్వాత 17వ శతాబ్దంలో నివసించిన హొన్నమ్మ. ఈమె సాంగత్య ఛందస్సులో కావ్యాన్ని రచించింది. త్రిపది ఛందమే కొద్ది మార్పులతో నాల్గు పాదముల సాంగత్య ఛందస్సుగా మారింది. 'హది ఒదెయ ధర్మవు' అన్న పేరుతో హొన్నమ్మ ఒక కావ్యం రచించింది.

తన్న తవరు మనెయన రిత్త పిత్తళే
హొన్నెందు బగెదు పూజి సువ
కన్నెయ రొళు కడు కూరెమయ నీడరిసి
పొన్ను రన్న దొళు పూజి సువుదు

తన పుట్టింటి వారు సంతోషంగా ఇచ్చిన ఇత్తడిని కూడా బంగారు పాత్రవలె భావించే స్త్రీని గౌరవించాలని పై దాని అర్థం.

అన్న పాన దీళు ఆభరణ వగున దొళు
మన్నణె యాళు మనవొలిదు
కన్న రన్నెయరు పరేకణెయ్యా లానునె
యున్నతి పడె దిప్పు వుదు

అన్నపానాదులలో, వస్త్రభూషణములలో, మానమర్యాదలతో సంతృప్తి పడిన స్త్రీచే మనఃపూర్వకంగా ఆశీర్వదింపబడిన ఆమె పుట్టిల్లు అభివృద్ధి చెందుతుందని అర్థం.

అక్కమహాదేవితో పాటు సమకాలికులైన మహాదేవి, బిజ్జలదేవి, కాళవ్వ, నీలమ్మ మొదలగు వచనకారులు ఆ కాలంలో రచనలు చేశారు. అంతేగాదు సమకాలీన సమాజంలో ఎంతో గౌరవాన్ని పొందారు.

చికదేవరాజు కాలములోని హొన్నమ్మకు సమకాలీన సాహిత్యకారులలో ఉన్నత స్థానమే ఉన్నది. 'చెన్నిగ బికదేవరాయన సంచియ హొన్నమ్మ' అని ఈమె గురించి చెప్పబడింది. కాబట్టి ఈమె తాంబూల కరండ వాహిని అయి ఉండాలి. హొన్నమ్మ కవిత్వము గురించి విన్న రాజు కోరిక మేరకు ఈమె రచించిన గ్రంథం 'హది బదియె ధర్మ'. ఈ కావ్యంలో కథ ఏమీలేదు. ధర్మాలను వివరించే భిన్న కథలు కన్పిస్తాయి. నిజానికి కన్నడ సాహిత్యానికి ఈ పద్ధతి చాలా కొత్తది. ఇందులో హొన్నమ్మ చెప్పిన పద్ధతిలో నవీనత్వం కన్పిస్తుంది. ఆమె అనుభవం గోచరిస్తుంది. పతివ్రతా ధర్మాలు చెప్పినప్పటికీ కేవలం స్త్రీది రెండవ స్థానము మాత్రమే అని చెప్పలేదు. స్త్రీల గురించి చులకనగా మాట్లాడువారిని ఉద్దేశించి 'తమకు జన్మనిచ్చి పోషించినది స్త్రీ కాదా! ఆడది అని ఎకసెక్కంగా మాటలాడేవారు మూఢులు, కొడుకైన వచ్చిన గొప్ప ఏమి? కూతురైన తగ్గిన గౌరవమేమి? అను అర్థమిచ్చే ఈమె కవితలు నేటికి వసివాడని సత్యాలు.

ఈమె తర్వాత హెళవన కట్టె గిరియమ్మ ఎన్నదగిన కవయిత్రి. పాండురంగ విఠలుని మీద భక్తితో రచనలు చేసింది. వివాహం జరిగినప్పటికి దానిని పట్టించుకోక వైరాగ్యంతో కృష్ణభక్తిలో లీనమైపోయింది. 'చంద్ర హాసన కథె, సీతా కల్యాణ, బ్రహ్మ కొరవంజి, భక్తియ హాడుగళు' అన్న రచనలు చేసింది. ఈమె గేయాలు సరళ సుందరాలు, కన్నడ భాషా సాహిత్యాలకు ఒక కొత్త ఒరవడిని కల్పించాయి. జానపద బాణీలలో రచింపబడ్డాయి ఈమె గీతాలు. ఉదాహరణలు చూడండి.

*"...... మంద జ్ఞానది తనువినాశాయ బిడలొల్లదు*
*వనజనాభ నిన్న నామద స్మరణె మాడదె*
*సాధు సజ్జనర సంగవ మాడి, పరసతి ఆధారవను మాడలొల్లదు...*

ఇంద్రియాలకు లొంగి మందబుద్ధితో ఉన్న తనకు ఆ భగవంతుని స్మరణ చేయాలన్న జ్ఞానం ఎప్పుడు కల్గుతుంది? అని పాడుతోంది గిరియమ్మ ఈ గేయంలో. అందుకే తనను కాపాడమని

*....... నొళదె బిద్ద దాదెతను హృదయ కమల దళ*
*నిందు రక్షిసు యెన్న నిందు హెళవన గట్టె రంగయ్య*

అంటూ అర్థించింది.

*ఈ మాతు దుసియెల్ల స్వామియ కరుణె ఉంటు*
*సీతాపతియె కరుణె ఉంటు*
*నిన్న కామితార్థలెల్ల, కైగూడిత్తు, కేళె అమ్మయ్య*

ఆ స్వామి కరుణ తనపై ఉంటే తనకిక ఏ కోరికలు లేవని చెప్పిన నిష్కామ భక్తురాలు గిరియమ్మ.

ఇక్కడ ఒక విషయం గమనించాలి. తమిళ సాహిత్యంతో ముఖ్యంగా భాషతో కన్నడ గేయాలను పోలిస్తే ఒక విషయం స్పష్టమవుతుంది. కన్నడ భాషలో స్త్రీల రచనలు చాలావరకు అనియత ఛందస్సులో నడిచాయి. మనసులోని ఆర్తిని, భక్తిని తెలపడానికి వీరు గేయాలు రచించారు కాని ఒక నియమిత తాళంలో, ఒక లయననుసరించి ఇవి రచింపబడలేదు అనిపిస్తుంది. నాల్గు పాదాల ఒక గేయంలో నాల్గు పాదాలు ఒకే తాళంలో ఇమడని సందర్భాలు ఎన్నోసార్లు కన్పిస్తాయి. తమదైన ఒక గానపద్ధతిలో, లేదా తమలో తాము చెప్పుకొంటున్నట్లుగా ఉంటాయి ఈ గేయాలు. తమిళ భాషలో ఉన్నంత సంగీత సాహిత్యాల సమ్మేళనం కన్నడ గేయాలలో కన్పించడం లేదు. బహుశః ఈ కవయిత్రుల నేపథ్యం దానికొక కారణం కావచ్చు. వీరిలో పెద్దగా చదువుకున్నవారు దాదాపుగా ఎవరూ లేరు. అందువల్ల భాషలో చెప్పుకోదగిన సున్నితత్వం కాని, అందం కాని కన్పించదు. కాని చెప్పిన విషయం నిజాయితీగా ఉండటం వలన, అందులో వారి స్వానుభవం కన్పించడం వలన నేటికీ వీరి గేయాలు జనుల నాల్కల పైన నాట్యమాడుతూనే ఉంటాయి.



# మలయాళం

మలయాళ భాషా సాహిత్యాలు ప్రాచీనమైనవి. సంస్కృత రామాయణ మహాభారతాలలో దీని ప్రస్తావన కన్పిస్తుంది. క్రీ.శ. 5,6 శతాబ్దాలలో విలసిల్లిన చెందమిళ్ మహా కావ్యాలలో ప్రఖ్యాతి చెందిన పదిట్రుప్పత్తు, చిలప్పదికారం వంటి కావ్యాలు మలయాళ భాషా సాహిత్యాల గురించి వివరిస్తున్నాయి. మలయాళ శబ్దము దేశవాచకముగా ఉపయోగింపబడినది. పర్వతము అనే అర్థంలో 'మల' పదం, దేశము లేదా భూభాగము అన్న అర్థంలో 'అలమ్' అన్న పదం కలిసి మలయాళమ్ అన్న రూపును సంతరించుకున్నది. క్రమంగా దేశము యొక్క పేరే భాషకు కూడా స్థిరపడింది. మలయాళము ద్రావిడ భాషా కుటుంబానికి చెందిన భాష. వ్యాకరణం, వాక్య సంయోజనం, పదప్రయోగాలు, క్రియలు ఈ విషయాన్ని ధ్రువీకరిస్తున్నాయి.

అయితే అన్ని భాషలలో లాగానే మలయాళంలో కూడా భిన్న రూపాలు కన్పిస్తున్నాయి. ముఖ్యంగా 'తెక్కన్' (దక్షిణం) 'వడక్కన్' (ఉత్తరం) అని రెండు రూపాలు కన్పిస్తున్నాయి. బహుశః భౌగోళిక విభజన ఈ రూపాలకు కారణం కావచ్చును. మలయాళానికి సొంత లిపి ఉంది. చేర పాండ్య రాజుల పరిపాలనా కాలంలో ఈ లిపికి 'వట్టె ఝుత్తు' అన్న పేరు ఉండేది. నాటి శాసనాలు, లేఖలు ఈ లిపిలోనే కన్పిస్తున్నాయి. తర్వాతి కాలంలో 'కోలెఝుత్తు' అన్న లిపిభేదం ఏర్పడింది. ఈ లిపిలో 'అ'కారానికి, బిందువుకు ప్రత్యేక చిహ్నాలు లేవు. నేటి లిపి ముఖ్యంగా మణిప్రవాళ ప్రభావంతో ఏర్పడింది. మలయాళం మూల ద్రావిడం నుండి విడివడి స్వతంత్ర రూపాన్ని సంతరించుకున్న తర్వాత మొదట చెందమిళ్ ప్రభావం వలన, తర్వాత సంస్కృత ప్రభావం వలన ఒక సారస్వత భాషగా వికాసాన్ని పొందింది. మలయాళం భాషకు సంబంధించినంతవరకు తొలి రచనలు 'పాట్టు' అని తెలుస్తున్నది. పాట్టు అంటే గేయాలు లేదా పాటలు అని అర్థం. కారణాలు ఏమైనా సరియైన ఆధారాలు దొరకనందువలన తొలి మలయాళ రచనలు లభించలేదు. బహుశః కొంత మౌఖిక సాహిత్యం కూడా దీనికి కారణం కావచ్చును.

ప్రాచీన సాహిత్యంలో ఎన్నదగిన సాహిత్య గుణం కల రచనలు చెందమిళ్ సాహిత్యమంటారు. ఈ రచనలలో కవిత్వ ధోరణి సరసమైన రీతిలో ఉండేదని పండితులు అంటున్నారు. లభించిన తొలి పాట్టు గ్రంథం 'రామ చరితం'. తర్వాతి కాలంలో మలయాళ సాహిత్యం మణిప్రవాళ శైలిని అనుసరించి గొప్ప కావ్య రచనకు మార్గం చూపింది. ఈ కాలంలోని కవులు ముఖ్యంగా ప్రకృతి ఉపాసకులు. నేటికి కేరళలో ప్రకృతి రామణీయకత ఎక్కువ. ప్రకృతి సౌందర్యానికి ముగ్ధులైన కవులు తమ కావ్యాలలో అద్భుత వర్ణనలు చేశారు. అయితే ఈ సందర్భంలో కవయిత్రుల ప్రసక్తి ఎక్కువగా కన్పించటం లేదు.

మలయాళ సాహిత్యంలో జానపద గేయ సారస్వతం పెద్ద స్థానాన్ని ఆక్రమించింది. సేకరింపబడిన జానపద గేయాలను ఈ రకంగా విభజించవచ్చును. 1) పుళ్లువన్ పాట్టులు (నాగ సంబంధిత గేయాలు), 2) కృషి పాట్టులు (కర్షక గేయాలు), 3) న్టట్ట పాట్టులు (ఊడ్పు పాటలు), 4) కల్యాణ పాట్టులు (వివాహ సంబంధిత గేయాలు), 5) కురవర్ పాట్టులు (స్థానికులైన కురవజాతి గేయాలు), 6) ఓన పాట్టులు (ఓనమ్ అను పండగ సంబంధిత గేయాలు), 7) తుంబి పాట్టులు (తుమ్మెద పాటలు) మొదలైనవి. సాధారణంగా ఈ గేయాలలో ఎక్కువ భాగం స్త్రీలు పాడేవే. ఏ ప్రాంతాన్ని గమనించినా ఈ విషయం మనకు అర్థమవుతుంది. కాబట్టి ఇందులో కొంతభాగమైనా స్త్రీలచేతనే రచింపబడి ఉండవచ్చును. అందుకే ఈ రచనలు చాలా సున్నితంగా ఉండేవి అని చెప్పటానికి ఈ విధంగా తర్వాతి కవులు చెప్పారు.

*కీచక మితకుయిలు తున్ను, పికగీత విశేషమోతిహ చెర్ను*
*హృది సూచిత మోద మోతిహ నిన్ను చిలవల్లి కానటికల్*
*వాయు సంచాలిత పల్లవాంగుళి భిరభినయిక్కున్ను...*

కోయిల గానాలతో, చల్లని మందమారుతాలతో అక్కడి వేణువులు పాటలు పాడుతున్నాయి అని భావం.

అయితే గేయాలు పూర్తిగా దొరికినప్పుడు ఆ పాటల శైలిని బట్టి మన ఊహకొక ఆధారం దొరుకుతుంది. ముందు కాలాలలో ఈ విషయం మీద పరిశోధన చాలా అవసరం.

బాలమణి అమ్మ అగ్రశ్రేణికి చెందిన ఆధునిక కవయిత్రి. కవిత్వమునకు ముఖ్యముగా గేయ కవిత్వమునకు – ఆమె కావించిన సేవ ప్రముఖమైనట్టిది. కప్పుకై (వినతి) అన్నది ఆమె మొదటి సంకలనము, సమకాలిక కవిత్వమున ప్రముఖముగా పరిగణింపబడుతున్నది. ఇందులో 'అమ్మ' అను ఖండకావ్యమున రసభావాలు, వేదాంతము ఎంతో శిల్పసంభరితాలుగా మేళవింపబడినవి. అది వ్యుత్పత్తిలో, భావనలో పరిశీలనాత్మకమైనట్టిది. అది తల్లి హృదయాన్ని, ఆమె స్వప్న సంతోషాలను, సుఖ దుఃఖాలను రమ్యంగా చిత్రించినది. ఈ అనుభూతులు రచయితలయందు కన్పించవు. తల్లి బిడ్డల సంబంధములలోని సర్వాంశములను ఈమె నిశితమైన దృష్టితో చిత్రించింది. ఇవేకాకుండా కుటుంబిని, ధర్మ మార్గదిల్, స్త్రీ హృదయం, భావనాయిల్, ప్రభాంకురం వంటి కొన్ని కావ్యాలను, పరిశీలనాత్మక దృష్టితో రచించింది. ఈమె రచనలలో తాత్త్విక ప్రధానమైనది 'లోకాంతరంగలిల్' అనునది.

ఈమె సమకాలికులలో కె.మాధవి అమ్మ, మేరీజాన్ తోట్టం, మేరీజాన్ కూతట్టుకుళం, ముతుకుళం పార్వతి అమ్మ అన్నవారు పేర్కొనదగిన ఇతర కవయిత్రులు.



పెదవులను మూసిపెట్టు. హృదయాన్ని తెరిచిపెట్టు.



ఈ ప్రపంచంలో అన్నిటికంటే విశాలమైనది – హృదయం.



మధురమైన ఉదకమున్న చోట నుయ్యి తియ్యి. మధురమైన హృదయమున్న వారితో నెయ్యము చెయ్యి.



# సింహావలోకనం

వేదకాలం నాడు సంఘం సర్వస్వతంత్రమైనది. రాజరికపు ఛాయలు ఇంకా అక్కడ ఏర్పడలేదు. ఈ కారణంగానే నాటి రచనలలో సంఘ ప్రయోజనాల కొరకు రచించిన ఋక్కులు విరివిగా కన్పిస్తున్నాయి. కాబట్టే వేదాలలో మనం చూసిన ఋషికల రచనలన్నీ సంఘాన్ని, జీవన విధానాన్ని ఉద్దేశించి రాసినవే. ఈ రచనల ఆధారంగా సమాజం పట్ల వారికి గల ఒక విశాలమైన అవగాహన మనకు తెలుస్తోంది.

ప్రాంతీయ భాషలు అభివృద్ధి చెందాక వచ్చిన సాహిత్యంలో కొంత మార్పు కనిపిస్తున్నది. తెలుగు సాహిత్యానికి సంబంధించినంత వరకు భగవంతుని కథలు రచించిన కవయిత్రులు కొందరైతే, తమని ఆదరించిన, పోషించిన రాజుల గురించి కవిత చెప్పిన కవయిత్రులు కన్పిస్తున్నారు. అంటే ఈ ప్రాంతంలో అప్పటికే సమాజం పట్ల తమ బాధ్యతను విదుషీమణులు మర్చిపోయినట్లు కన్పిస్తున్నది. ప్రసక్తానువశంగా కొన్ని నీతులు, ధర్మాలు చెప్పినప్పటికీ ముఖ్యంగా వారి రచనా ఉద్దేశాలు వేరు.

తమిళ భాషలో చూసినట్లయితే సంఘ సంస్కరణ ఉద్దేశాలు గల కవయిత్రులు ఎందరో కన్పిస్తారు. అతి ప్రాచీన కాలంలోనే చిన్నపిల్లల కోసం, విద్యార్థుల కోసం రచనలు చేసిన కవయిత్రుల గురించి చెప్పుకున్నాం. దక్షిణ భారతదేశంలో సాంఘిక స్పృహ తమిళ కవయిత్రులకు ఎక్కువ అని చెప్పక తప్పదు. అంతేగాదు ఈ కవయిత్రుల నేపథ్యం కొంత సంస్కారవంతమైనది. అందుకే చెప్పుతున్న విషయాన్ని చక్కటి భాషలో, గేయ పద్ధతిలో, పదికాలాలపాటు సంఘం గుర్తుంచుకునే విధంగా చెప్పగలిగారు. భాష పట్ల, సాహిత్యం పట్లా వీరికి ఒక స్పష్టమైన అవగాహన ఉన్నట్లు చెప్పవచ్చును. ఈ స్పృహ నేటికీ తమిళ దేశంలో కన్పిస్తుంది.

కన్నడ భాషకు సంబంధించి కవయిత్రులు కొంత సంఘాన్ని ఎదిరించి నిలబడినట్లు కన్పిస్తోంది. సంఘ కట్టుబాట్లను ఆనాడే ధైర్యంగా ఎదిరించి తమదైన కార్యక్షేత్రాన్ని తామే ఎన్నుకొని నల్గురికి ఆదర్శప్రాయంగా నిలిచినట్లు కన్పిస్తోంది.

ఎందుకంటే ఈ కవయిత్రులు దాదాపుగా సంఘంలో కడజాతి వారుగా కన్పిస్తున్నారు. అందువల్లనే వారిపట్ల చూపిన అన్ని రకాల వివక్షలను ఎదిరించారు. కట్టుబాట్లను సడలించారు. అదే భావాలను తమ కవితలలో చూపారు. అయితే వీరి భాష కొంత మధ్యమార్గంగా నడిచింది. భగవంతుని ఆరాధన వీరి రచనలలో కన్పించినప్పటికీ పూర్తిగా విరాగులు కారు.

పై మూడింటితో పోల్చి చూసినప్పుడు మలయాళ సాహిత్యంలో కవయిత్రులు చాలా తక్కువగా కన్పిస్తారు. నిజానికి మలయాళ దేశం అనాదిగా స్త్రీకి చాలా ప్రాముఖ్యత ఇచ్చిన ప్రాంతం. అటువంటి ప్రాంతం నుండి స్త్రీల రచనలు లభించలేదు అంటే శోచనీయమైన విషయం. సరైన రక్షణ లేక స్త్రీల రచనలు నశించిపోయాయా? లేదా సాహిత్యం మీద ఆనాటి స్త్రీలు అంతదృష్టి పెట్టలేదా సరిగ్గా చెప్పలేం. మలయాళ భాషా సాహిత్యాలకు సంబంధించి నా పరిశోధన పెద్దగా సాధించినదేమీ లేదు.

మొత్తానికి నా పరిశోధన ద్వారా తేలిన విషయాలు రెండు. మొదటిది తమకున్న పరిధిలో తమ శక్తిని చూపించిన నాటి స్త్రీలు. సమాజం పట్ల వారు ప్రదర్శించిన బాధ్యతను నేడు పరిగణనలోకి తీసుకోవాలి. ఏ లక్షణాలు అలవరచుకోవడం వల్ల సమాజం అభివృద్ధి చెందగలదో వీరు తమ గేయాల ద్వారా తెలియచెప్పారు. తోటి కవులు శృంగార వర్ణనలు చేస్తున్న సమయంలో సమాజం పట్ల వీరు చూపిన శ్రద్ధ అవగాహన ప్రశంసనీయం. రెండవ విషయం భాష. జనసామాన్యానికి అందుబాటులో ఉన్న వ్యవహారిక శైలిని వీరు తమ గేయాలలో పొందుపరిచారు. ఒకటి రెండు అపవాదాలు ఉండవచ్చును. కాని లలితమైన, సులభమైన భాషను వీరు ఉపయోగించారు. ప్రజలకు దగ్గరగా వెళ్లటానికి, వారితో మమేకం కావటానికి వ్యవహారిక భాష అవసరాన్ని వీరు నిరూపించారు.

దేశానికి స్వాతంత్ర్యం వచ్చాక అన్ని రంగాలలో స్త్రీలు ముందుకు వచ్చారు. తమ తమ రంగాలలో చెప్పుకోదగిన అభివృద్ధిని సాధించారు. ఈనాడు వీరికున్న అవకాశాలు ఆ కాలంలో వారికి లేవు. కాని వారి ఉత్సాహం, వారి కార్యదీక్ష, పట్టుదల నేటి స్త్రీ లోకానికి ఆదర్శం కావాలి. ఆ ప్రేరణతో జాతీయతా భావాన్ని మరింత పటిష్టం చేసుకొని నేటి మహిళా లోకం ఆకాశమే తమ సరిహద్దుగా ముందుకు సాగాలని ఆకాంక్షిద్దాం.





# ఉపసంహారం

భారతీయులు అర్ధనారీశ్వర తత్వాన్ని ఆరాధిస్తారు, గౌరవిస్తారు. కాబట్టే ప్రాచీన కాలంలో స్త్రీ పురుషులిరువురి మధ్యా అంతరాలు కన్పించలేదు. వేదకాలంలో మొదలైన ఈ సమానత్వం చాలా కాలం వరకు కొనసాగింది. అయితే తర్వాతి కాలంలో వరుసగా జరిగిన విదేశీయ దండయాత్రలకు అణగారిపోయిన భారతదేశం తన సర్వశక్తులను, లక్షణాలను, ప్రత్యేకతలను మర్చిపోయింది. రాజకీయ, సామాజిక, ఆర్థిక కారణాలెన్నో సమాజంలో భయంకరమైన మార్పులను తెచ్చాయి. ఏ సుగుణాలు, ఏ వైశిష్ట్యాలు భారతదేశాన్ని ప్రపంచ పటంలో ప్రత్యేకంగా నిలబెట్టాయో, ఆ వైశిష్ట్యాలు మటుమాయం అయినాయి. క్రమంగా సమాజంలో పురుషాధిక్యత పెరిగింది. మహిళలు ఇంటికే పరిమితం అయిపోయారు. ఒక కాలంలో తాము సాధించిన విజయాలేంటో, సంఘ నిర్మాణంలో తమ పాత్ర ఎటువంటిదో, సంగీత సాహిత్య రంగాలలో తమ కృషి ఎటువంటిదో వారు మర్చిపోయారు. అనాదిగా ఈ భరత భూమి పవిత్రమైన భూమి. ఇక్కడి నేల, నీరు, గాలి ఇతర ప్రాకృతిక వనరులు అన్ని నిత్యనూతనాలై ప్రజలకు సహకారులుగా ఉంటూ వారిని ముందుకు నడిపించాయి.

కాల చక్రంలో ఎన్నో మార్పులు వస్తుంటాయి. గతించిన కాలంలోని ఉత్తమత్వాన్ని పునాదిగా చేసుకొని వర్తమానంలో సరియైన మార్గాన్ని ఎన్నుకొని భవిష్యత్తును ఉజ్జ్వలంగా చేసుకోవాలి. కారణాంతరాల వలన మరుగున పడిపోయిన స్త్రీ శక్తిని తిరిగి దీప్తిమంతం చేయాలి. నేడు భారతదేశంలో కన్పిస్తున్న నవీనత గాని ఉత్సాహం గాని నిజానికి భారతీయతను ప్రతిబింబించడం లేదు. బాహ్యాడంబరాలు ఎక్కువగా కన్పిస్తున్నాయి. వేషధారణలో మార్పులు రావడం, ప్రవర్తనలో మార్పులు రావడం సహజమే కాని ఆత్మ భారతీయతను దాటి పోరాదు. "జననీ జన్మభూమిశ్చ స్వర్గాదపి గరీయసీ" అన్న ఆర్య వాక్కు మరచిపోరాదు. స్త్రీ తన శక్తిని తానే తక్కువగా

అంచనా వేసుకొని కేవలం ఆటబొమ్మగా మారుతున్న ప్రమాదం నేటి సమాజంలో అడుగడుగునా కన్పిస్తోంది. ప్రాంతీయ భేదాలు, భాషా భేదాలు రోజురోజుకు ఎక్కువవుతున్నాయి. ఇవి ప్రజలను మరింత దూరం చేస్తాయి.

ఉపోద్ఘాతంలో చెప్పినట్లు దక్షిణ భారతదేశం ఎన్నో విషయాలలో సాపత్యం ఉంది. వాస్తవం చెప్పాలంటే నేటికి అసలైన భారతీయత ఈ నాల్గు ప్రాంతాలలోనే కన్పిస్తుంది. ఈ సంస్కార జ్యోతిని ఈ తరం వాళ్ళు చేతులడ్డుపెట్టి కాపాడగల్గితేనే రాబోయే తరాలలో ఈ సంస్కారం కొనసాగుతుంది. ఈ మహత్తర కార్యంలో నా ఈ చిన్న ప్రయత్నం మొదటి మెట్టు మాత్రమే. సంగీత సాహిత్య రంగాలలో నాకున్న అభినివేశం, అభిరుచి నన్నీ పనికి పురిగొల్పాయి. ఇదే విధంగా ఇతర రంగాలలో కూడా ఇటువంటి ప్రయత్నం జరిగితే ఎంతో బాగుంటుంది. నాల్గు రాష్ట్రాలలో సాధ్యమైనంత వరకు తిరిగినా నాకు లభించిన సమాచారం చాలా తక్కువ. అయినా నిరాశ పడకుండా నేను ఈ పనిని కొనసాగించాను. ఈ పని నా తర్వాతి పరిశోధకులకు ఒక మౌలిక సమాచారంగా ఉపయోగపడగలదు. దీని ఆధారంగా భవిష్యత్తులో ఈ అంశం మీద మరింత పరిశోధన జరగాలని ఆశిస్తున్నాను.



అందం కంటిని ఆకట్టుకుంటుంది. సౌశీల్యం హృదయాన్ని దోచుకుంటుంది.



ధనం పోతే తిరిగి సంపాదించుకోవచ్చు. ఆరోగ్యం చెడితే మందులు సేవించి ఆరోగ్యాన్ని కాపాడుకోవచ్చు. కాని వ్యక్తి తన శీలగుణ సంపదని కోల్పోతే సమస్తమూ కోల్పోయిన వాడవుతాడు.



నిరాడంబరమైన జీవనం, ఉన్నతమైన, ఉత్తమమైన, ఆదర్శవంతమైన ఆలోచనలు గల వ్యక్తులను మాత్రమే సమాజం గౌరవిస్తుంది.